# మీ పాపాయి బరువు వయస్సుకు తగ్గట్టుగా వున్నదా?

పాపాయి మొదటి ఏడాది పుస్తకం.

గ్లాక్సో

మీ పాపాయి సరియైనంత నిద్ర పోతున్నాడా?
పాపాయికి మొదటి పన్ను ఎప్పుడు వస్తుంది?
నేను పాపాయికి కావలసిన పోషణ తత్వాలన్నిటినీ ఇస్తున్నానా?
పాపాయి ఎలాంటి ఆధారం లేకుండా నిలకడగా ఎప్పుడు కూర్చొగలడు? నిలబడగలడు?

క్రొత్తగా తల్లులయినవారు ఎదుర్కొనే ఈ ప్రశ్నలకే కాదు, మరెన్నో ఇతర ప్రశ్నలకు జవాబులు అందిస్తుంది **'పాపాయి మొదటి ఏడాది పుస్తకం'**! క్రొత్త ఫారెక్స్ నుండి ఇది మీకొక ఉచిత కానుక.

**'పాపాయి మొదటి ఏడాది పుస్తకం'లో** పాపాయి పట్ల తీసుకోవలసిన శ్రద్ధను గురించి మీకు సహాయకరమైన వివరాలు ఎన్నో వున్నాయి. పాపాయి ఆహార సమయాన్ని ఆనందకరంగా చేయడానికి ప్రత్యేకంగా రూపొందించబడిన 23 రుచికరమైన ఫారెక్స్ వంట పద్ధతులు కూడా ఇందులో వున్నాయి.

నేడే మీ ప్రతి కొరకు వ్రాయండి.

క్రొత్త
**పాలతో కూడిన**
**ఫారెక్స్**
**ఘన ఆహారం**

మంచి ఆరోగ్యానికి మూలస్థానం – ***గ్లాక్సో***



ఈ కూపన్ దిగువ చిరునామాకు పంపండి.

గ్లాక్సో లాబొరేటరీస్ (ఇండియా) లిమిటెడ్. పో. ఆ. బాక్స్ 19119 (**FCM. 25**) బొంబాయి 400 025.
Glaxo Laboratories (India) Limited, P.O.Box 19119(**FCM-25**), Bombay 400 025.
దయచేసి నాకు ఒక "పాపాయి మొదటి ఏడాది పుస్తకం" ప్రతి పంపండి.
తపాలు మరియు ఇతర ఖర్చులకోసం రూ. 1/- తపాళా బిళ్లలు జతపర్చబడినవి.

పేరు : ______________________

చిరునామా : ______________________

______________________

______________________

CLARION/B/GX/7/244 TEL



పాఠక మానస సరోవరంలో పల్లవించే
మరో కెరటం

# మయూరి

## సచిత్ర వారపత్రిక

మీ అభిమాన రచయితల మనోజ్ఞమైన సీరియల్స్....

* ఆంధ్రుల ఆహ్లాద రచయిత
  **మల్లాది వెంకట కృష్ణమూర్తి** ఈ ఏటిమేటి సస్పెన్స్ థ్రిల్లర్!
* ప్రేమ నవలా చక్రవర్తి
  **కొమ్మూరి వేణుగోపాలరావు** నవ నవలా తరంగం!
* ఆంధ్రా హెరాల్డ్ రాబిన్స్
  **చందు సోంబాబు** మలుపుల,వలపుల జీవన సరిగమ!

**ప్రత్యేక ఆకర్షణ!**

సూపర్ హీరోయిన్ **జయసుధ**
**మయూరి** కోసం ప్రత్యేకంగా రాస్తున్న
**సూపర్ సీరియల్!**

పై సీరియల్స్‌తో పాటు కథలు, సినిమా విశేషాలు, యువతీ యువకులకు, పిల్లలకు ప్రత్యేక శీర్షికలు, జోక్స్, కార్టూన్స్, వింతలు- విశేషాలు.. ఇంకా...ఎన్నో...ఎన్నెన్నో-

వెల: **రెండు రూపాయలే!**




**కాకతీయ పబ్లికేషన్స్**
5-8-55/ఎ, నాంపల్లి స్టేషన్ రోడ్,
హైదరాబాద్ - 500 001

## న్యూఢిల్లీ లేఖ

డి ఎ రామరాజుగారు చాలా పొరపాటుగా వ్రాశారు వారు అలా వ్రాశారంటే వారికి జయ దుబాషీగారి సంగతి అసలు తెలియదుఅని నాకు అనిపిస్తోంది నేను వీరి గురించే పత్రిక కొంటాను మరి మరీ చదువుతాను. మిగతా జోక్సు, చిన్నకథలు మాత్రమే చదువుతాను.

ఎమ్ ఎ సుబ్బారావు, భీమవరం

### 'అప్పుడేనా?'

ఆంధ్ర సచిత్ర వారపత్రికలో సీరియల్‌గా ప్రచురించిన "పసిడి బొమ్మ" ఈవారం అయిపోయింది అని ప్రకటించారు ఈ నవలను శ్రీమతి ప్రమీలా జనార్ధన్ అసంపూర్తిగా ముగించటం ఏమీ బాగోలేదు అనిత, విజయ్‌లను కలిపి కధ సుఖాంతం చేస్తారనుకొన్నాము కనీసం విజయ్ నిర్దోషి అనే విషయం అనిత గుర్తించేలాగయినా ముగించ లేదు రమేష్ పాత్రను మధ్యలో నే వదిలేసారు రమేష్‌లో కూడా పరివర్తన వచ్చి అనిత, విజయ్‌ల కలయికకు దారి చూపించిన వ్యక్తిగా చిత్రిస్తే బాగుండేది

–టి ఎ ఎస్ ఎస్ ప్రకాష్, ధవళేశ్వరం

### ఎందుకు?

ఆంధ్ర సచిత్ర వార పత్రిక చాలా బాగుంటోంది కాని 'న్యూఢిల్లీ లేఖ', ఫాలాక్షుని డైరీ' ఈ రెండు పేజీలూ ఏ మాత్రం ఆసక్తికరంగా లేవు శ్రీ జయ దుబాషిగారి ఫోటో మొదటి మాటు ప్రచురించడం సరి కాని ప్రతి వారం ఎందుకు వేస్తున్నట్లు? ఆయన వ్యాసాల్లో తెలుగు వారికి తెలియనివి, తెలుసుకోవలసినవి ఏమీ లేవు అనిపిస్తోంది

ఫాలాక్షుని డైరీ లో వన్నీ చాలా పాత వార్తలు దినపత్రికలలో నెలల క్రితం వచ్చినవే! ఈ రెండు




పెజలకు బహులుగా యువత నుంచి పాఠశాలల్లో, కళాశాలల్లో వారికి కలిగే తమాషా అయిన, చిత్రమైన అనుభవాలు ఆహ్వానించి వేస్తే కొత్త రకంగా బాగుంటుందేమో! (రాజకీయాలు కాదు)

ఎం మహాలక్ష్మి, పూనా

### "భావ్యం కాదు"

ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ ఎన్ టి. రామారావు గారు ఇటీవల ఢిల్లీ వెళ్ళినప్పుడు "భారతదేశం" పార్టీ ఏర్పాటు విషయంలో వెనుదిరిగే ప్రశ్న లేదని స్పష్టం చేశారు పైగా పార్టీ ఏర్పాటు విషయమై అనేకమంది ప్రతిపక్ష నాయకులతో కూడా చర్చించారు ప్రస్తుత పరిస్థితుల్లో "భారతదేశం" పార్టీ ఏర్పాటు కావడం వల్ల సంఘ విద్రోహకులు ఈ పార్టీ నీడన చేరే అవకాశమున్నది తద్వారా దేశ విచ్ఛిన్నతకి పాటుపడే ఈ విద్రోహకుల ఆగడాలు ఇంకా ప్రజ్వరిల్లే అవకాశం వున్నది ఒక ప్రక్క కేంద్రంతో సహకారం అంటూనే కేంద్రాన్ని బల... పరిచే విధంగా శ్రీ ఎన్ టి ఆర్ "భారతదేశం" ...ని ఏర్పాటు చేయబూనడం భావ్యం కాదు దే... రక్షణను కంటికి రెప్పలా కాపాడవల్సిన తరుణంలో ... ఎన్ టి ఆర్ దేశమంతటా విస్తరించి వున్న వేర్పా... దు లను ఏకం చేసే భారతదేశం పార్టీ ప్రతిపా... తక్షణం ఉపసంహరించుకోమని ప్రార్థించు చున్నాము.

అబ్దుల్‌రజాక్, తండ్రి శ్రీ అజీజుల్‌హక్, మసీదు వీధి, కంతంరాజు కొండూరు–522330 □


# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం 1908

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు:
(1938 - 1972)

శుక్రవారం 26 ఏప్రిల్- 2 మే, 1985

శ్రీ క్రోధన నామ సం వైశాఖ శు షష్ఠి
సంపుటము 77 : సంచిక 34

సంపాదకుడు
శివలెంక రాధాకృష్ణ

| | | |
|---|---|---|
| విడి ప్రతి వెల | రు. | 2-00 |
| ఆరు మాసాల చందా | రు. | 55-90 |
| పోస్టలో ఏడాది చందా | రు. | 111-80 |

ఆంధ్రపత్రిక కార్యాలయము,
గాంధీనగరం, విజయవాడ-520 003




## విషయానుక్రమణిక

న్యూఢిల్లీ లేఖ



డా. జయదుబాషి

# మృతనగరంగా మారుతున్న కలకత్తా!

**పా**త సైనికులలాగే పాత నగరాలకి కూడా చావులేదు అవి అలా తెర మరుగైపోతాయి రాజీవ్ గాంధీ జీవితంలో ఆత్మీయులైన వారి మృతి అతి పెద్ద పాత్రని నిర్వహించింది కాబట్టి ఆయన ఒక విధంగా అలాంటి విషయాలలో నిపుణులైనప్పటికీ అలా భావించరు కలకత్తా ఒక మృత నగరంగా మారబోతున్నది లేదా బహుశః ఈపాటికే అది మృతనగరం అయిపోయి ఉండవచ్చని ఆయన అనుకుంటున్నారు ఆయన ఆలోచన సరైనదే కావచ్చు రాజప్రాసాదాల నగరంగా ఒకనాడు భాసిల్లి బ్రిటిష్ సార్వభౌమత్వానికి భారతదేశంలో రాజధానిగా ఉన్న కలకత్తా ఊరేగింపుల నగరం స్థాయినించి మృతనగరం స్థితికి దిగజారిపోయింది

ప్రపంచంలోని నగరాలలో కలకత్తా ఒక మురికివాడ లాంటి హీనస్థితికి దిగజారిపోయి ఉండవచ్చు కానీ అలాంటివి ఈ దేశంలో చాలా ఉన్నాయి బొంబాయి ఒకప్పుడు చాలా అందమైన నగరం సముద్ర తీరాన ఉన్న ఒక సామ్రాజ్యం లాగా ఉండేది కానీ ఇవాళ కలకత్తా లాగే హీనంగా, మురికిగా తయారైంది దాదాపు అన్ని నగరాలూ ఇలాగే ఉన్నాయి జనసమూహాలని అది దూరంగా ఉంచగలగటం వల్లనే ఢిల్లీ తన గత వైభవాన్ని ఇంతవరకూ నిలుపుకోగలిగింది అని చెప్పవచ్చు పెరిగిపోతున్న జనాభా తాకిడికి తట్టుకోలేక ఎప్పుడో ఒకప్పుడు ఢిల్లీ కూడా తలవంచక తప్పదు నిరంతరం పెరుగుతున్న ఈ జనాభా మన నగరాలనే కాక మొత్తం దేశాన్నే ముంచి వేసే రోజు రాబోతున్నది

కలకత్తా మృత నగరంగా మారడానికి కారణాలు వేరు బొంబాయి కాంక్రీట్ మహారణ్యం అయితే కావచ్చు కానీ అది మృతనగరంగా మారడం లేదు అంతేకాదు అది ధన సంపాదనకే తన శక్తినంతా వినియోగిస్తున్నప్పటికీ సూయజ్‌కి ఇటు వైపున ఉన్న చాలా అందమైన నగరం అన్నది వాస్తవం

కలకత్తా మృతనగరం కావడానికి కారణం సూక్ష్మంలో చెప్పాలంటే సంపద ఆ నగరం నించి తప్పుకోవడమే ఇప్పుడది ఊపిరాడక ఎగశ్వాసతో కొట్టుకుంటున్నది మిగతావి ఎన్ని ఉన్నా అప్పుడప్పుడు నాగరికతని పునరుద్ధరించక పోతే అది అంతరించే ప్రమాదం ఉంది దానికి నిరంతరం గానో, లేదా తరచుగానో ధారాళమైన మోతాదులలో డబ్బు పెట్టుబడి పెడుతూ ఉండాలి కలకత్తా ఆవిర్భవించిన 18వ శతాబ్దం కన్నా ఈ 20వ శతాబ్దం పూర్తిగా భిన్నమైనటువంటిది మొత్తం జాతీయ ఉత్పత్తికి మనం సరి అయిన వైపు ఉన్నప్పుడే మనగలుగుతాము, పెంపొందగలుగుతాము

నా మిత్రుడు అశోక్ మిత్రా ఏదైనా చెప్పవచ్చు కానీ దురదృష్ట వశాత్తు బ్రిటిష్‌వారు తమ రాజధానిని కలకత్తా నించి ఢిల్లీకి మార్చినప్పటినించీ బెంగాల్ మొత్తం జాతీయ ఉత్పత్తికి సరి అయిన వైపులేదు అదే ఆ నగరానికి తగిలిన మొదటి దెబ్బ

దానినించి అది ఇంకా కోలుకోలేదు తర్వాత దానికి తగిలిన రెండో దెబ్బ దేశ విభజన ఈగల్లాగా వచ్చి పడిన శరణార్థులు దానిని పీల్చి పిప్పి చేశారు. కానీ దేశంలోని మిగతా ప్రాంతాలకి కూడా శరణార్థులు వచ్చారు అయినా పంజాబ్ దెబ్బతినలేదు ఎందువల్ల? బొంబాయికి శరణార్థులు ఎప్పుడూ రాలేదు కానీ ఆ నగరం అన్నినగరాలకన్నా, కలకత్తా కన్నా కూడా, చాలా వేగంగా పెరిగిపోతున్నది అయినా అది ఎప్పటిలాగే సంపన్నంగా ఉండగలుగుతున్నది అలాగే పంజాబ్ కూడా అది తలసరి ఆదాయంలో దేశంలో అగ్రస్థానంలో ఉన్న రాష్ట్రం పంజాబ్ కేంద్రానికి గారాలపట్టి అనీ, తమ రాష్ట్రం వేరుగా చూడబడుతున్నదనీ బెంగాలీలు అంటారు అది నిజమైతే కావచ్చు కానీ బెంగాల్ నాయకులు- వాళ్ళు కాంగ్రెసు వారైనా, కమ్యూనిస్టులైనా- ఈ పక్షపాత ధోరణిని ఎందుకు ఎదిరించరు? వాళ్ళందరూ దానిని ఎందుకు సహిస్తున్నారు? మిత్రా, ఆయన మిత్రులు చెప్పే లెక్కలని బట్టి మీరు సహాయం, గ్రాంటులు వగైరా వివరాలలోకి వెళ్ళాల్సి ఉంటుంది ఒకప్పుడు దేశానికి గర్వకారణమైన ఈ మహానగరం నేడు ఈ స్థితికి దిగజారడానికి కారణం అప్పుడు మీకు కనిపిస్తుంది

నగరం అన్నది ఒక జీవ పదార్థం లాంటిది దానికి బహిర్గతమైనదే కాక అంతర్గతంగా కూడా జీవం ఉంటుంది ఆధునిక నాగరికతా చిహ్నాలైన భవనాలు, రోడ్లు, కర్మాగారాలు మొదలైనవి దాని బహిర్గత జీవానికి రూపకల్పన చేస్తాయి అంతర్గతంగా ఉండే జీవం దాని లోపలి పొరలో స్పందించే హృదయం అది కొత్త సవాళ్ళకి దిగజారిపోకుండా ప్రతిస్పందిస్తూ ఉంటుంది డార్విన్ సిద్ధాంతం వర్తించే అన్ని జీవరాసుల విషయంలోనూ ఇది సత్యం మనుషులకీ, జంతువులకీ, నగరాలకీ, నాగరికతలకీ కూడా ఇది వర్తిస్తుంది ఇదే పెరుగుదలకీ, వినాశనక్రమానికీ హేతువు ఈ సవాళ్ళని ఎదుర్కొనగలగటం, ఎదుర్కోలేకపోవటం అన్నది ఎప్పుడూ కొత్త సమస్యలని ఎదుర్కొగలిగినటువంటి మనో నిబ్బరం, శక్తి ఉన్నప్పుడే సాధ్యమవుతుంది మీరు మానసికంగా మాత్రమే సవాళ్ళని ఎదుర్కోలేరు మీకు కావలసిన శక్తిని మీరు సమకూర్చుకో లేకపోతే మీ పతనం ప్రారంభమవుతుంది వృద్ధి చెందుతున్న మీ స్నాయువులని మరో జీవి ఏదో పట్టుకుని అక్కడినించి మిగతా ప్రాంతాలకి కూడా వ్యాపిస్తుంది

శక్తి హీనత కారణంగా బెంగాల్ బాధపడుతున్నదా? మానసిక శక్తికి సంబంధించినంతవరకూ అక్కడ కొదువలేదు సత్యజిత్‌రే, మృణాల్‌సేన్ వంటి వ్యక్తులు, బిధాన్‌చంద్రరాయ్, జ్యోతిబసు లాంటి రాజకీయవేత్తలు హిందూస్తాన్ లీవర్‌కి చెందిన అశోక్ గంగూలీ వంటి ఉన్నతశ్రేణి మేనేజర్లు

## న్యూఢిల్లీ లేఖ....

ఉన్నారు కానీ దురదృష్టవశాత్తు అశోక్ గంగూలీ బొంబాయి నించే తమ విధులను నిర్వహిస్తారు కానీ అది సరిపోదు ధన సంపాదనే అభివృద్ధిని నిర్దేశించే ఈ కాలానికి అనుగుణంగా పారిశ్రామికవేత్తలని బెంగాల్ తయారు చేయలేకపోయింది ఒకప్పటి బెంగాల్ ఉన్నతికి కారకులైన బిర్లాలు, గోయంకాలు ఇప్పుడు అక్కడనించి తప్పుకున్నారు అసలు కలకత్తా నిర్మాతలైన బ్రిటిష్‌వారు అక్కడ నుంచి వెళ్ళిపోయారు వాళ్ళ కంపెనీలు పోయాయి మూ ల పడిన పరిశ్రమలు కొన్ని ప్రభుత్వపరం అయినాయి వాటిని ఆ ప్రభుత్వం కూడా సరిగా నిర్వహించలేక పోవడం, మిగతావారు బయటివారి పోటీకి తట్టుకోలేక పోవడం జరుగుతున్నది బొంబాయిలోని మఫత్‌లాల్ లేదా ధీరూబాయ్ అంబానీ వంటి శక్తివంతమైన పారిశ్రామికవేత్త ఒక్కరు కూడా బెంగాల్‌లో లేరు కనీసం పూనాలోని కిర్లోస్కర్‌లాంటి వారు కూడా అక్కడ ఎవరూ లేరు బెంగాలులో ఉన్న, లేక బెంగాలీలచే నడపబడుతున్న ఏ కంపెనీ దేశంలోని అతి పెద్ద 50 కంపెనీలు, ఇంకా చెప్పాలంటే పెద్ద 100 కంపెనీలలో ఒకటిగా కూడా లేదు బెంగాలీలలో మంచి మేనేజర్లు, కార్య నిర్వహణాధికారులు ఉండవచ్చు కానీ వారు మాత్రమే సరిపోరు మానేజర్లనేవాళ్ళు ఇతరులకి చెందిన సంస్థలని నిర్వహించగలరు కానీ మీకు కావలసింది సంస్థలని నిర్మించేవారు అంబానీ మొట్టమొదట ఒక పెట్రోలు బంకులో గుమాస్తాగా తమ జీవితాన్ని ప్రారంభించారు కానీ ఇవాళ ఆయన దేశంలో అతి పెద్ద కంపెనీ అయిన తాతా ఉక్కు సంస్థతో, కార్పొరేట్ రంగంలో ప్రథమ స్థానం కోసం, పోటీ పడుతున్నారు మెదడు మాత్రమే ఉంటే దానివల్ల మీకు ఒరిగేదేమీ ఉండదు ఆర్థిక శాస్త్రంలో నోబెల్ బహుమతి పొందిన వారు మిగతా దేశాలకన్నా బ్రిటన్‌లో ఎక్కువ మంది ఉన్నారు కానీ ఆ దేశంలో ఆర్థిక వ్యవస్థ ఎలా ఉందో చూడండి మరో వంక జపాన్‌లో ఇద్దరికి మించి లేరు కానీ వారి ఆర్థిక వ్యవస్థ ఎలా ఉందో మీకు తెలుసు మీ తెలివి తేటలని, శక్తిని ఏ రకంగా వినియోగిస్తున్నారన్నది ముఖ్యం. జ్యోతిబసు తమ రాష్ట్రంలోని విద్యుత్ సమస్యని ఏడేళ్ల నించీ పరిష్కరించ లేక పోతున్నారు జపాన్ మనకన్నా పదింతలు శక్తిగల విద్యుత్ కేంద్రాన్ని మూడేళ్లలో నిర్మించింది. ఆ సమస్య పశ్చిమ బెంగాల్ రాష్ట్రంలోని మహా మేధావుల శక్తికి మించినంతటి జటిల మైనదా? కలకత్తాని చూసి ఎవరైనా విచార పడాల్సిందే కానీ అది మృతనగరంగా మారడానికే నిర్ణయించు కున్నట్లు కనిపిస్తున్నది □

# ఆటలో గెల్చారు దాహంతో వచ్చారు.




## ఇదిగో, ఇక్కడ తయారు క్రొత్త రెక్స్ ట్రింకా వారిపై రుచిదే గెలుపు!

మళ్లీ వీరే గెల్చారు!
గుంపులు గుంపులుగా వచ్చారు.
గోల-గోలగా ఇంట్లోకి దూరారు.
సంతోషంతో కేకలు వేశారు. చల్లటి పానీయం కావాలని అడిగారు. లేత-లేత ముఖాలు ఎండలో ఆడి-ఆడి కందిపోయాయి.

మరి నేను కూడా వారిని గెలవడానికి సిద్ధంగా వున్నాగా! క్రొత్త రెక్స్ ట్రింకాతో. ఎందుకంటే నాకు తెలుసు దాని మధుర రుచి అందరికీ ఇట్టే నచ్చుతుందని.

అంతేకాదు, రెక్స్ (నా విశ్వాసాన్ని చూరగొన్న వారు) ఇప్పుడు నాకు కావలసింది ఎంచుకొనే అనుకూలం కూడా అందించారు.

పౌడర్ ప్యాకెట్—6 పెద్ద గ్లాసుల పానీయం తయారు చేసుకోడానికై. క్రొత్త లిక్విడ్ కాంసెంట్రేట్—నిల్వ చేసుకోడానికి వీలుగా 3 సీసాల సిరప్ తయారు చేయగల్గింది ఇదొక్కటే. 50 పెద్ద గ్లాసుల పానీయం తయారు చేయడానికై. వీటి సహాయంతో ఇట్టే చిటికెలో ఒక ట్రే నిండుగా రుచికరమైన, ఉత్తేజకరమైన, సేదతీర్చే చల్లటి పానీయం తయారు చేశా. త్రాగినంతనే పిల్లలు సంతోషం పట్టలేక గెంతులు వేశారు. 'ఇంకా-ఇంకా కావాలం'టూ కేకలు వేశారు. ట్రింకా ఇచ్చి నేను సులభంగా గెల్చిపోయా!




లిక్విడ్ కాంసెంట్రేట్—
50 గ్లాసుల
పానీయం తయారు
చేస్తుంది.

పౌడర్ ప్యాక్
విటమిన్ 'సి'తో
సమృద్ధం చేయబడినది.
6 గ్లాసుల
పానీయం తయారు
చేస్తుంది.







REX
# ట్రింకా
రుచిలో అన్నిటికన్నా మిన్న!

CLARION/B/CP/2/244 TEL

# పడమట సంధ్యారాగం

ఆదూరి సావిత్రి

(గత సంచిక తరువాయి)

"ఈ మధ్య నసలు ఇటువేపు రావటం లేదేం ?'' పదిహేను రోజుల తరవాత ట్యూషన్ కొచ్చిన లీల నడిగింది ఛాయ.

''పెళ్ళికెళ్ళాను మేడం.'' అన్నది లీల.

''సరే. కూచో. ఇంతకుముందు నీకు ప్రైవేటు సెక్టార్ గురించి చెప్పాను గదా ? దాంట్లో కొన్ని ప్రశ్నలిస్తాను. ఆన్సర్ చెయ్యి. తరవాత పబ్లిక్ సెక్టార్ గురించి చెపుతాను.'' అంటూ కొన్ని ప్రశ్నలిచ్చింది ఛాయ.

అరగంట తరవాత లీల రాసిన ఆన్సర్ పేపర్ చూసి విస్తుపోయిందామె. లీల మరీ మొద్దుకాదు. చెపితే అర్థం చేసుకోగలదు.

కానీ... ఇదేమిటి? ప్రశ్నకు ఏ మాత్రం సంబంధంలేని జవాబు...

''ఈ పేపర్ చూడు లీలా. ఒంట్లో బావుండ లేదా? పోనీ... ఈ రోజుకు రెస్ట్ తీసుకో.'' తను రాసిన ఆన్సర్లు చూసి తనే సిగ్గుపడిపోయిన లీలతో అన్నది ఛాయ.

లీల కళ్ళలో నుంచి నీళ్ళు ముత్యాల్లా రాలాయి...

తను గమనించలేదు గానీ... ఈ పదిహేను రోజుల్లో లీలలో ఏదో మార్పు వచ్చింది. మొహం జబ్బుపడ్డట్టుగా, కళ్ళు దీనంగా ఉన్నాయి.

''ఏమయిందమ్మా? నీ సమస్యకు పరిష్కారం చూపించలేనేమో గానీ...విని అర్థం చేసికోగలను. మనసులో బాధను ఒంటరిగా అనుభవించటం అన్నా, ఎవరితోనైనా పంచుకుంటే కాస్త తగ్గినట్లుంటుంది. మామూలుగా గొడవలేనా ?''

''కాదు అవి నాకలవాటయిపోయాయి. నేను హరాయించుకోగలను.''

''మరి? నువ్వు హరాయించుకోలేని కొత్తవేం జరిగాయి?''

''నాకు చెప్పాలనే ఉంది. ఎలా మొదలుపెట్టాలో...''

''ఎలా మొదలుపెట్టినా పర్లేదు.''

**జరిగిన కథ:** ఇందుకూరు కాలేజీలో ఛాయ లెక్చరర్‌గా చేరింది. ఆమెవెంట తల్లి అన్నపూర్ణమ్మ, తమ్ముడు రాజీవ్ ఇందుకూరు వచ్చేసారు. సుధీర్ ఛాయ వాళ్ల మేడమీద గదిలో ఉంటుంటాడు. ఛాయ కుటుంబానికి విజయ కుటుంబానికి సన్నిహితం ఏర్పడుతుంది. సుధీర్ ఛాయను ప్రేమిస్తాడు. ఛాయ మేనమామ ఛాయను పెళ్ళిచేసుకుంటాననిఛాయ తల్లితో చెప్తాడు. ఛాయ అందుకు నిరాకరించిందని అతను కోపంగా వెళ్లిపోతాడు విజయ చెల్లెలు రేణు పెళ్లికి వెళ్లి వస్తారు సుధీర్, ఛాయ,రాజీవ్. పెళ్లైన అనసూయ రాజీవ్‌కు ప్రేమలేఖ రాసింది. రాజీవ్ అనసూయకు రాసిన ఉత్తరం ఆమె తండ్రి చేతిలో పడింది. అది ఛాయ, అన్నపూర్ణమ్మల దృష్టికి వచ్చింది అనసూయ వాళ్లు ఇల్లు కాళీ చేసి వెళ్ళిపోయారు.

చుట్టూ ఓమారు చూసి. నెమ్మదిగా చెప్పసాగింది లీల...''నాకు పద్దెనిమిదేళ్ళు దాటాయి. అయినా నేను ఇంటరే చదువుతున్నాను. తెలివి తక్కువదాన్నయి, ఫెయిలయీ కాదు.

టెంత్ అయ్యాక, కాలేజీలో చేరటానికి సరిగ్గా మూడు సంవత్సరాలు ఇంట్లో పోరాటం సాగించాలిసొచ్చింది...

అదలా వదిలెయ్యండి ఆ మూడేళ్ళలో మావాళ్ళు నాకో సంబంధం చూశారు. పెళ్ళికొడుకుపేరు రవి. అతనికో చెల్లెలుంది.

''మీరు మా అమ్మాయికో మంచి సంబంధం చూసి సెటిల్ చేస్తే...మీ లీలను మా ఇంటి కోడలుగా చేసుకుంటాం.'' అన్నాడు రవి తండ్రి.

ఆ ఒప్పందం మీద మావాళ్ళు ఆ అమ్మాయికి మా పిన్నికొడుకును మాట్లాడారు. అతను ఎయిర్‌ఫోర్స్‌లో పనిచేస్తున్నాడు. ఇది కుదిరి, రవి చెల్లెలు పెళ్ళి అయ్యేసరికి ఒక సంవత్సరం పట్టింది.

ఆ పెళ్ళికి నన్నూ తీసికెళ్ళారు వాళ్ళ కోరికమీద. పెళ్ళయ్యాక మావాళ్ళు నా విషయం అడిగారు.

''మీ లీల మా రవికి నచ్చలేదుట వాడు ఒప్పుకోటల్లేదు'' అన్నాడు రవి తండ్రి.

రవి మౌనంగా, ఏం పట్టనట్లుగా ఊరుకున్నాడు

మొదటిసారిగా నా కన్నెమనసుకు తగిలిన గాయమది. ఓర్చుకోటం చాలా కష్టమయింది...

వాళ్ళనో నాలుగు తిట్టుకుని ''దరిద్రపు జాతకం నీది. ఆ పిల్లకు చటుక్కున పెళ్ళయింది. నువ్వుమాత్రం ఇలాగే తగలడ్డావు. ఈ పీడ మాకంత త్వరగా ఒదులుతుందా...'' అంటూ నా గాయంమీద ఒత్తుగా కారం అద్దారు మా వాళ్ళు.

గాయాలను చేసే భగవంతుడే... వాటిని మాన్పటానికి కాలం అనే మందునుకూడా ఇచ్చాడు..

రవి ఉష అనే అమ్మాయిని పెళ్ళి చేసుకున్నాడు. పెళ్ళయిన ఆరునెలలకా రవి తండ్రి, మా పిన్ని కొడుకు.... అంటే... రవి చెల్లెలు భర్త యాక్సిడెంటులో మరణించారు

ఇంట్లో ఇద్దరు విధవలు...

''తమకి ప్రత్యేకంగా ఓ గది ఉండాలని... తామిద్దరూ సరదాగా షికార్లకూ సినిమాలకు తిరగాలని, నవ్వుతూ తుళ్ళుతూ ఉండాలని'' ఉష కోరిక.

''వాళ్ళెదురుగా అలా ఉండటం బాగోదని, ముఖ్యంగా తన చెల్లెలు తట్టుకోలేదని'' రవి వాదన.

పెద్ద బొట్టుతో, తలనిండా పూలతో, రంగురంగుల చీరలతో తిరిగే ఉషమీద ఈర్ష్యతో, రవి రాగానే ఆమెమీద లేనిపోనివన్నీ చెప్పి, బుడిబుడి దీర్ఘాలు తీస్తూ అతన్ని ఉషమీదకు ఎక్కేస్తేవాళ్ళ తల్లీ కూతుళ్ళు...ఉషతో ఫ్రీగా ఉండటం చాతకాక, వాళ్ళమాటలు విని ఆమెనే హింసించేవాడు రవి.

ఇది భరించలేక తిరగబడేది ఉష.

ఇదీ ఆ ఇంటి చరిత్ర.

ఆ హింసను భరించలేక... రవిని తనవేపు తిప్పుకోలేక. . నిరాశతో...ఉక్రోషంతో మీద కిరసనాయిలు పోసుకుని నిప్పంటించుకుని బలవంతంగా చనిపోయింది ఉష.

అదంతా జరిగి ఆరునెలలయింది మేడం.

మొన్నమేంవెళ్ళిన పెళ్ళికి రవికూడా వచ్చాడు. ''నేను లీలను కానీ కట్నం లేకుండా పెళ్ళి చేసుకుంటాను.'' అని అతను మావాళ్ళ దగ్గర ఉదారంగా ప్రకటించాడు.

వీళ్ళు నేను ఒదిలిపోతేనే చాలని సంతోషంగా ఒప్పుకున్నారు

ఎవరూ లేకుండా చూసి నాచెయ్యి పట్టుకుని ''ఐ లవ్యూ లీలా,'' అన్నాడు రవి.

రగిలిపోయింది నాకు. ఈడ్చి దవడమీద కొట్టాను. ఈ విషయం చాలాదూరం పోయింది.

అంతా నాదే తప్పన్నారు. అనాధనుకదా...నాకెవరి సపోర్టు లేదు. మనవాళ్ళకు బలం ఎటువేపుంటే అటు మాట్లాడటమే అలవాటు.

నేను మాత్రం అతన్ని చచ్చినా చేసుకోనని చెప్పాను మొండిగా.

ఇహ ఇంటికొచ్చాక కొత్త రకం నరకం మొదలయింది నాకు.

ప్రతిచిన్న విషయానికీ నేనుచేసిన పని గురించే ఎత్తిపొడుస్తూ ఎన్నాళ్ళయినా ఈ శని మాకు విరగడయేలా లేదని తిట్టిపోసూ ...కాళ్ళ దగ్గరకొచ్చిన అవకాశాన్ని కాలదన్నానని దెప్పిపొడుస్తూ...

తినటానికి తిండిలేకపోయినా, అహానికి అడ్డేలేదని ఎత్తిపొడుస్తూ... నీ మొహానికి రెండోపెళ్ళి వాడు పనికిరాడా అని నిలదీస్తూ....

నన్ను అన్నం కూడా సరిగ్గా తిననివ్వటంలేదు మేడం మా వాళ్ళు.









# పడమటి సంధ్యారాగం

మీరు చెప్పండి. నిజంగా...నేను చేసింది తప్పేనా?

అతనో అవకాశవాది. నీచుడు.

భార్యను బలవంతంగా ఆత్మహత్యకు పురికొల్పిన మూర్ఖుడు తల్లికీ, చెల్లికీ భార్యకూ మధ్య సంయమనం కుదుర్చుకోలేని పిరికివాడు.

ఆ రోజు "లీల నాకు నచ్చలేదు." అని చెప్పి ఈ రోజు ఒంటరిగా చెయ్యి పట్టుకుని ప్రేమ పాఠాలు వల్లించబోయిన దరిద్రుడు.

నేనతన్ని తిరస్కరించటం తప్పా ?

ఇప్పటి వరకూ నా జీవితంలో అభిమానం, అనురాగం అనే వాటికి చోటు లేదు.

కానీ... నేను ఆశావాదిని.

భగవంతుడు అన్నీ కష్టాలే ఇవ్వడనీ, చీకటి తరవాత వెలుగు వచ్చినట్లే... నాకు కూడా వెలుగునిచ్చే రోజులు ముందున్నాయనే ఆశతో బ్రతుకును లాక్కొస్తున్నాను.

చిలకతో చీట్లు తీయించుకుని...ఎల్రక్ట్రానిక్ జోస్యం చెప్పించుకుని "నీ జీవితం ముందు ముందు మంచి స్థితిలో కొస్తుంది. నీ దాంపత్య జీవితం బ్రహ్మాండంగా ఉంటుంది" అనే కోయజోస్యం విని, అందమైన భ్రమలో బ్రతుకుతున్నాను మేడం నేను. అలాంటిది ఇంత స్పష్టంగా అతని గురించి తెలిసి కూడా ఆ క్రూరమృగాలున్న బోనులోకి నేనెలా దూరను ? చేతులారా నా జీవితాన్ని ఇంకా నాశనం చేసుకోనా?"అంటూ లీల గట్టు తెగిన ఏరులా భోరున ఏడిచేస్తుంటే మౌనంగా దగ్గరకు తీసుకుని తల నిమిరింది ఛాయ.

ఆమె గుండెలు బరువెక్కాయి.

ఏమని ఓదార్చాలి ? ఈ అమ్మాయి వయసెంత? ఆ కష్టాల తూకమెంత ?

"నువ్వు మంచిపని చేశావు లీలా. విరక్తితో...మీవాళ్ళ ఫోర్స్‌తో అతన్ని చేసుకుని, మరో ఉషగా మారకుండా ధైర్యంగా నిలబడ్డందుకు నిన్ను అభినందిస్తున్నాను. మీవాళ్ళు ఎన్నాళ్ళు సాధిస్తారు ? ఆ వేడి తగ్గితే వాళ్ళే ఊరుకుంటారు. నువ్వేం పట్టించుకోకు. ప్రతి సమస్యకూ ఓ పరిష్కారం తప్పకుండా ఉంటుంది. ఒక్కోసారి అది లభించటానికి టైం పట్టొచ్చు. నువ్వు మననును చదువుమీద కాన్సన్‌ట్రేట్ చెయ్యి..." అన్నది ఛాయ.

ప్రవాహంలో కొట్టుకుపోతున్నవాడి కామాత్రం గడ్డిపోచ చాలు !

వాన వెలిసిన ప్రకృతిలా నవ్వింది లీల.

* * *

లెదర్ కేస్ చేత్తో పట్టుకుని, చొరవగా లోపలికొస్తున్న ఆగంతకుణ్ణి పరిశీలనగాచూసి, చదువుతున్న పుస్తకం విసిరేసి "హాయ్! అన్నయ్యా!" సంతోషంగా అరుస్తూ అతని చేతిలో లగేజ్ అందుకున్నాడు రాజీవ్.

"ఎవరూ ? శ్రీనివాసా ! ఎన్ని సంవత్సరాలకి మేం గుర్తొచ్చామయ్యా! అసలు నువ్వు మమ్మల్ని మర్చిపోయి ఉంటావనుకున్నాము. రా కాళ్ళు కడుక్కో! అమ్మావాళ్లంతా బావున్నారా?"అన్నది అన్నపూర్ణమ్మ.

ఆవిడ మరిది కొడుకతను. మంచి జీతం, పెద్ద హోదా కలిగిన ఉద్యోగి. పేరున్న రచయిత. ఇంకా పెళ్ళికాలేదు.

"ఒరే అన్నయ్యా ! నువ్వు...నువ్వెప్పుడొచ్చావ్ ? అసలు.. మమ్మల్ని చూడాలనే ఐడియా నీకెలా వచ్చింది? అన్నట్లు...నేను గుర్తున్నానా? నా పేరు ఛాయ." నిష్ఠూరంగా, సంభ్రమంగా అన్నది ఛాయ.

"మరీ టూ మచ్‌గా యాక్టు చెయ్యకు. నువ్వెన్ని ఉత్తరాలు రాశావు? ఏ మాత్రం గుర్తుంచుకున్నావు? ఎన్నిసార్లొచ్చావు ?

యు నో ఛాయా...ఆ ఊరికి ఈ ఊరెంతదూరమో...ఈఊరికి ఆ ఊరూ అంతే." నవ్వుతూ అన్నాడు శ్రీనివాస్.

"ఇదన్యాయం. నేను ఆడపిల్లని. ఒంటరిగా నీ దగ్గరకు అంతదూరం ప్రయాణంచేసి రాలేనిదాన్ని. అబలని. నీకూ నాకూ పోటీనా?"

"అది జ్ఞాపకమొచ్చే, చివరకు నేనే వచ్చేశాను. ఉత్తరాలు కూడా రాయరా అబలలు?!"

దొరికిపోయినట్లుగా చూసింది ఛాయ. అయినా బింకం సడలకుండా "ఉత్తరాలు రాస్తేనే అభిమానమున్నట్లా? లేకపోతే లేనట్లేనా?" అన్నది.

"అసలు పాయింటు కొచ్చావుగదా. మనుషులు కలిస్తేనే మమతలున్నట్లా? లేకుంటే లేనట్లేనా?" అన్నాడు శ్రీనివాస్.

"అయ్యో రచయితగారూ తమ రెలాగయినా మాట్లాడగలరు. ఏ రంగయినా పూసి ఔననిపించగలరు. ఆ టాకింగ్ పవరు నాకెక్కడ నుంచొస్తుందీ?"

"టాకింగ్ పవరు నీకే ఉండాలి. లెక్చరర్‌వి గదా! నాకు లేదు. లేకున్నా పర్లేదుకూడా. మాకు రైటింగ్ పవరూ... థింకింగ్ పవరూ ఉంటే చాలు."

"మీరిద్దరూ మాట్లాడుకుంటున్నారా... పోట్లాడుకుంటున్నారా?" సందేహంగా అడిగాడు రాజీవ్.

ఇద్దరూ నవ్వేసి మామూలు మూడ్‌లో కొచ్చేశారు.

"ఇంకా పెళ్ళి ప్రయత్నాలేం చెయ్యటల్లేదా ?" అన్నది అన్నపూర్ణమ్మ

"నాకేం పెళ్ళి పిన్నీ! ఇంత నల్లటివాణ్ణి ఎవరు చేసుకుంటారు?" హాస్యంగా అనబోయినా... ఒక భావావీచిక అతని ముఖంలో తేలిపోవటం ఛాయ దృష్టిలో పడింది.

ఊరుకోమన్నట్లు తల్లికి సైగ చేసింది.

# ఉచిత కానుక!

# గ్లూకోన్-డి ® యొక్క తక్షణ శక్తితోపాటుగా




# ఆకర్షణీయమైన స్టెయిన్‌లెస్ స్టీల్ చెమ్చా ఒకటి.

తక్షణ శక్తినిచ్చే మీ దినసరి పానీయం. దాన్ని కలుపుకోడానికొక చక్కని సాధనం.

ఈ తళతళ మెరిసే స్టెయిన్‌లెస్ స్టీల్ చెమ్చా గ్లూకోన్-డి 400 గ్రా. ప్యాక్‌తో పూర్తిగా ఉచితం.

తాజాదనాన్నీ, చల్లగా శక్తినీ ఇచ్చే గ్లూకోన్-డి విటమిన్ డి, కాల్షియం, ఫాస్ఫరస్‌లతో బలపరచబడినది. దాన్ని అలాగే తీసుకోండి, లేదా పళ్లరసం, పాలు, తేనీరు, కాఫీ, లేదా మంచినీళ్లలో కలిపి తీసుకోండి.

అయితే ఒక్కటి! దాన్ని గ్లూకోన్-డి ప్రత్యేక కానుక చెమ్చాతో మట్టుకు కలిపి తీసుకోండి!

HTB-GLL-9686



400 గ్రా.
ప్యాక్‌పై
ఈ కానుకకోసం
చూడండి




స్టాకు పరిమితం, నిర్ణీత స్థలాలలో మాత్రమే లభ్యం.

మంచి ఆరోగ్యానికి మూలస్థానం గ్లాక్సో

## తక్షణ శక్తి కోసం—గ్లూకోన్-డి ®

# పడమటి సంధ్యారాగం

ఆవిడది పట్టించుకోకుండా "నీ అందం ఎవరిక్కావాలయ్యా! ఇప్పుడు నీ జీతం, హోదాచూచి ఏ ఆడపిల్లయినా ఎగిరి గంతేసి చేసుకుంటుంది." అన్నది.

"అదే నాకు బొత్తిగా ఇష్టంలేనిది." బలవంతంగా అన్నాడు శ్రీనివాస్. అతనికా ప్రసక్తి ఇష్టంలేనట్లు గ్రహించిన ఛాయ "అమ్మా అన్నంపెట్టు ఆకలేస్తోంది. ఉదయం టిఫిన్‌కూడా తినలా నేను" అన్నది.

"రండి వడ్డించేస్తున్నాను." అంటూ లోపలికెళ్ళింది అన్నపూర్ణమ్మ.

అన్నం తిన్నాక కాసేపు నిద్రపోవటం ఆవిడకలవాటు. రాజీవ్ ట్యూషన్‌కెళ్ళాడు.

గదిలో శ్రీనివాస్, ఛాయ కూర్చున్నారు...

"ఇప్పుడు చెప్పన్నయ్య, నువెందుకు పెళ్ళిని వాయిదా వేస్తున్నావు?" అన్నది ఛాయ.

"నువ్వూ అలాగే చేస్తున్నావుగా?" అన్నాడు శ్రీనివాస్.

"నా సంగతివేరు. ఈ కుటుంబం నామీద ఆధారపడి ఉంది ప్రస్తుతం. పెళ్ళిచేసుకోకూడదనే నియమం నాకులేదు. రాజీవ్ టైపు, షార్టుహేండుకూడా నేర్చుకుంటున్నాడు. వాడికి ఉద్యోగం వచ్చిన మరుక్షణం నేను పెళ్ళిచేసుకుంటాను. ఇప్పుడే చేసుకుంటే, నా సంపాదన వీళ్ళకి పెట్టటం నాభర్తకిష్టం లేక పోవచ్చు. ఆ రకంగా మా మధ్య మనస్పర్ధలు రావచ్చు. ఆ విధమైన రిస్క్ తీసుకోటం ఇష్టంలేదు నాకు. నీకిలాంటి బాదరబందీ ఏంలేదుగదా?"

"నన్ను నన్నుగా ప్రేమించగల అమ్మాయి కావాలి ఛాయ. నాకు నా నిరీక్షణ అంతులేనిదని—నా అన్వేషణ ఫలించదని, నాది దురాశ అని నాకు బాగా తెలుసు. అయినా—మనసు సరిపెట్టుకోలేను. మనసు చంపేసుకుని నా సాహచర్యం చేసే అమ్మాయిని నేను భరించలేను... అందుకే నాకీ జన్మలో పెళ్ళి యోగం లేదనుకుంటున్నాను."

"మీ రచయితల ఊహాశక్తి ఇలాంటి వెర్రితలలే వేస్తుంటుంది అప్పుడప్పుడు. నిన్ను పెళ్ళిచేసుకున్న అమ్మాయి నిన్నునిన్నుగా ప్రేమించక ఇంకొకరిగా ప్రేమిస్తుందా?"

"అందరి సంగతీవేరు. నా సంగతివేరు. నామీద నాకు ఆ మాత్రం కాన్ఫిడెన్స్‌లేకుండా చేసింది నా శరీర వర్ణం ఒకటే కాదు. చిన్నప్పట్నించి నాకెదురైన సంఘటనలు...... నా చుట్టూ ఉన్న రకరకాల వ్యక్తులు..." అంటూ తన జీవిత పుటలు ఒక్కొక్కటే విప్పి చూపసాగాడు శ్రీనివాస్.

విభ్రాంతితో చూస్తోంది ఛాయ.

*　　*　　*

రైలు ఇంకొన్ని క్షణాల్లో ప్లాట్‌ఫాం మీదికి రాబోతోంది...

విపరీతమైన టెన్షన్ అనుభవిస్తూ అంబాసిడర్ కారు నానుకుని స్టేషన్ వెలుపల నిలబడి ఉన్నాడు శ్రీనివాస్.

**అతని ఆలోచనల వేడికి అద్దం పడుతున్నట్లు పెదవుల మధ్య ఎర్రగా వెలుగుతోంది సిగరెట్టు...**

తను నలుపు. బాగా నలుపు. కేవలం ఈ రంగు మూలంగానే తను ఎన్నో హేళనలు, అవమానాలు ఎదుర్కొన్నాడు... చిన్నప్పుడు అమ్మ పక్కన కూర్చుంటే...

"అబ్బ! నీ కొడుకెంత నలుపే హైమా! తెల్లగా ఉన్న నీ పక్కనయితే వీడు మరీ...పోత పోసిన నల్లరాతి శిలా విగ్రహంలా ఉన్నాడు," అనే వారు బంధువులు.

కాస్త ఎదిగాక ...







అన్నయ్య హఠాత్తుగా చనిపోయాడు. వాడు అమ్మలాగా తెల్లగా అందంగా ఉంటాడు.

"అయ్యో ... ఈ శ్రీనుగాడు పోయి, వాడయినా ఉండకూడదూ? బంగారంలాంటి పిల్లడు పోయాడు." అని అమ్మ నాన్నతో అంటూ ఏడవటం నేను విన్నాను.

నా మనసు రాయిలా బిగుసుకుపోయింది.

ఏ కొడుకూ వినకూడని... విని భరించలేని మాటలవి. ఏ దురదృష్ట క్షణాలు ఆమె చేత అలా అనిపించాయో!

అవి తన మనసులో గాఢంగా ముద్రించుకుపోయాయి.

కాలేజీలో ...

"ఎవరే అతను ?" మంజుల గొంతు.

"అతనా? అతని పేరు శ్రీనివాస్." అంటూ నవ్విందో అమ్మాయి.

"ఓహ్! అచ్చం అపర శ్రీనివాసునిలా... ఆ విగ్రహం కలర్‌లోనే ఉన్నాడు గదే!" హేళనగా అన్నది మంజుల.

తను చాలా బలంగా ఉంటాడు. వెనక్కివెళ్ళి ఆ అమ్మాయి చెంపలు అదిరిపోయేలా కొడితే?

కానీ...అలా అన్న ప్రతివాళ్ళకూ అవే బహుమతులిచ్చుకుంటూ పోతే చివరకు తనెక్కడ తేలతాడు ?

మెంటల్ హాస్పటల్లో.

అందుకే...తనలోని ఎగ్జయిట్‌మెంట్‌ను అతికష్టంమీద అణుచుకునేవాడు.

తన కసినంతా చదువుమీద చూపిస్తూ...తన వ్యధనంతా సిరాగా మార్చి పెన్నులో పోసుకుని రచనలు చేస్తూ...వాటినే తన ఆత్మీయులుగా భావిస్తూ తనచుట్టూ ఓ ప్రపంచాన్ని నిర్మించుకున్నాడు.

నాలుగంకెల జీతగాడయి...ఒక స్టేటస్‌కు చేరుకున్నాడు. రచయితగా గుర్తింపబడ్డాడు.

తన రచనల్లో ఆర్తి పాఠకుల హృదయాలను మెలివేసేది.

తను రాసిన "నన్నూ మనిషిగా గుర్తించండి." అనే నవల పాఠకుల్లో విపరీతమైన సంచలనాన్ని కలిగించింది.

అనేకరకాలైన ఉత్తరాలు వస్తూ ఉండేవి...

లలిత అనే అమ్మాయినుంచి వచ్చే ఉత్తరాలు తనన బలంగా ఆకర్షించేవి.

"మీ రచనల్లోని ఆర్తి, ఆవేశం, భరించలేని వేదన, నన్ను మీవేపు నెడుతున్నాయి. మిమ్మల్ని నా హృదయానికి దగ్గరగా చేర్చుకుని అనునయించాలనిపిస్తుంది..." అంటూ ఆత్మీయంగా ఎన్నోరాసేది.

నవలలోని హీరోలా ఆ నవలా రచయితనే ఊహిస్తూ...ఆ హీరో అలవాట్లు, అందచందాలు, అనుభవాలు, సాహసాలు, వీటన్నిటినీ ఆ రచయితకే ఆపాదించుకుంటూ కలలుగనే మానసిక జాడ్యం చాలామంది ఆడపిల్లల కుంటుందని నాకు తెలుసు...

లలితకూడా అలాంటిదేనని ఆమె తీసుకుంటున్న చొరవే చెపుతోంది.

అయినా... ఏదో ఆకర్షణ. ఒకరకమైన మత్తు

కనీసం ఉత్తరాల్లోనయినా దొరికే... ఎన్నడూ అనుభవంలేని ఆ అనురాగాన్ని పోగొట్టుకోలేని బలహీనత... దీన్ని ఆధారం చేసుకుని అనతికాలంలోనే తనకు చేరువయింది లలిత.

తన హోదా చూసి ఇప్పుడెవరూ తనని హేళన చెయ్యరు. ఆడంబరంగా అభిమానాన్ని ఒలకబోస్తుంటారు.

అయినా తను ఒంటరి!

చిన్నప్పట్నుంచీ తనచుట్టూ ఓ గిరిగీసుకుని అందులో తనమతానే బంధించుకునేవాడు.

ఆ వలయంలో తనకు తనే ఆత్మీయుడు... స్నేహితుడు... ఇప్పుడు లలిత తనకు తెలియకుండానే దాన్ని ఛేదించుకుని లోపల జొరబడింది...

"మిమ్మల్ని చూడాలనుంది. ఎప్పుడు?" అని రాసింది లలిత.

తన గుండెలో రాయిపడింది.

తనను చూడగానే ఆ అమ్మాయి ప్రేమకు రెక్కలొచ్చి ఎగిరిపోతే?

దాహంతో అలమటిస్తున్న వాడికి చల్లని మంచి నీరు దొరికినట్లు, తనకు దొరికిన ఒకే ఒక్క మధురస్మృతి లలిత. అది ఎండమావి అయితే...

ధైర్యం చాలటంలేదు. ఆమెను చూడకుండా ఆ ఉత్తరాలలోని మధురిమనిలాగే ఆస్వాదించాలనుంది.

ఆమె వినదు. ఆతృత పడుతుంది. నిష్ఠూరమాడుతుంది. ఊపిరి సలపనివ్వదు.

హఠాత్తుగా...

ఫలానా ట్రైన్‌లో వస్తున్నాను. రిసీవ్ చేసుకోమని రాసింది.. తనెలా ఉంటుందో. ఏ చీరకట్టుకుందో రాస్తూ "మీరు టికెట్స్ చెక్‌చేసి తీసుకునే ఎంట్రన్స్ దగ్గర నిలబడండి." అని రాసింది.

ఆమె ఆదేశం ప్రకారం తను రావటంకన్నా గత్యంతరం లేకపోయింది.

**(ఇంకా వుంది)**

# వ్యక్తిగతం



మార్క్ చాగాల్ తన 97 ఏట ఇటీవలే మరణించాడు. ఈ సుప్రసిద్ధ చిత్రకారుడు 1887లో రష్యాలో పుట్టాడు. వీరు 10 మంది అన్నదమ్ములూ, అప్పచెల్లెళ్ళూ. లలిత కళల విద్యాలయంలో చేరటానికి ప్రయత్నించి, విఫలుడయి, కొంతకాలం ఇళ్ళలో పని కూడా చేసి చివరికి బక్‌స్ట్ అనే చిత్రకారుడి వద్ద చేరాడు

1910లో చాగాల్ తన దేశం వదిలి పారిస్‌కి వలస వెళ్లాడు

1914లో పారిస్‌ని వదిలి బెర్లిన్‌కి మారాడు

అక్కడ 1922 దాకా ఉండి తిరిగి స్వదేశానికి వెళ్ళిపోయాడు కాని ఎక్కువ కాలం రష్యాలో ఉండలేక మరు సంవత్సరమే పారిస్‌కి తిరిగి వచ్చేశాడు యూదుడు కనుక 1941లో చాగాల్ అమెరికాకి వలస వెళ్ళవలసి వచ్చింది అయినా యుద్ధం ముగియగానే 1945లో మళ్ళీ పారిస్ చేరుకున్నాడు అపటి నుంచి మరణించే దాకా ఫ్రాన్స్‌లో నే ఉన్నాడు 1948లో అతను ఆ దేశం దక్షిణ భాగంలో ఒక ఇల్లు కొనుక్కుని అక్కడే స్థిరపడిపోయాడు (ఆ ఊరి పేరు వెన్‌స్)



కొత్త ఢిల్లీలోని సోవియట్ సమాచార కార్యాలయంలో మూడవ కార్యదర్శిగా ఉన్న శ్రీ ఐగోర్ గుయేజా(37) మార్చి 17 ఉదయం వాహ్యాళికి వెళ్లి అంతర్థానమైపోయారు. వారం రోజుల తర్వాత ఆయన అమెరికా వెళ్లినట్లు, భారతదేశం వెలుపల రాజకీయాశ్రయం కోరినట్లు వార్తలు వెలువడ్డాయి. గత ఆరేళ్ళుగా భారతదేశంలో ఉన్న ఈయన పేరు నేత్య వేత్తల జాబితాలో లేదట. సోవియట్ దౌత్యోద్యోగులు వారి రాయబార కార్యాలయం అనుమతి ముందుగా పొంది జట్లుజట్లుగా మాత్రమే బయటికివెళ్లాలన్న నియమముంది. కాని శ్రీ గుయేజాకి మాత్రం ఒంటరిగాబయటికి వెళ్ళే స్వేచ్ఛఉన్నదట. సోవియట్‌లాండ్ ప్రచురణతో సంబంధంకల ఈయనకి ఇంగ్లీషు ధారాళంగా వచ్చు. శ్రీ గుయేజా దగ్గర చాలా విలువైన సమాచారం ఉండి ఉండవచ్చును కుంటున్నారు. ఈయన ఖాట్మాండూమీదుగా అమెరికా వెళ్లిఉంటారని భావిస్తున్నారు ...

# వారఫలం

## 26-4-1985 శుక్రవారం మొదలు 2-5-1985 గురువారం వరకు

★ **మేషం** : కుటుంబ సభ్యులను గూర్చి శ్రద్ధ గైకొనవలసిన అగత్యమున్నది ధన వసతికి ఏ లోపం లేదుగాని వ్యాపార విషయంగా జాగ్రత్తపడాలి ఒకానొక విషయం అనుకూలం కాగలదని ఆశించినది ప్రతికూలం కావటం, బంధు విరోధం చెప్పదగిన అంశాలు స్త్రీలకు సకల విధాల జాగ్రత్త తీసికొనకుంటే ఏవో యిబ్బందులు వెంటాడ గలవు

★ **వృషభం** : ఒకానొక విషయంలో ఆశించిన ప్రగతి ఏర్పడగలదు ధనాదాయం, మిత్రవర్గంవలన మేలు, ఎంతో కాలంగా కొనాలని ఉబలాటపడిన వస్తువు సేకరించుకొనుటకు అవకాశం లభ్యం కావటం గమనింపదగిన అంశాలు స్త్రీలకు వివాహ లగ్నములకు హాజరు కావటం, సుఖ సంతోషాలకు ఆకరం

★ **మిధునం** : వ్యాపార రీత్యా అనానుకూలత సంభవిస్తుందేమో! కుటుంబంలో రవరవలు పుట్టకుండా జాగ్రత్త పడాలని కూడా గ్రహించాలి ఎంతో కాలంగా మీ మీద అభిమానం గలవారు హటాత్తుగా విడిపోవటం సంభవం రాజకీయ వాదులకు అనుకూలవారమే స్త్రీలకు క్రితం ఎంత శ్రమించినా జరుగని ఒకానొక కార్యం సులభ సుందరంగా నెరవేరటం గమనించగలరు

★ **కర్కాటకం** : స్థిరచరాస్తులు పెంపొందు యత్నములలో నిమగ్నులు కాగలరు వాహనం కొనుకోలు చేయువారికి అనుకూలం, కార్ఖానాలందు శ్రమించేవారికి, ప్రభుత్వోద్యోగ మందున్న వారికి అత్యంత యోగకాలం స్త్రీలకు సాహితీ పరంగా గాని, నటన రీత్యాగాని ఆట పాటల యందుగాని ప్రగతి, లబ్ధి కనిపిస్తుంది

★ **సింహం** : అనుకొనని విధంగా, ఆశించని విధంగా, స్థిరాస్తి రీత్యా మేలు చేకూరుతుంది కొంత దూర ప్రయాణాలకు అవకాశం, ఒకవేళ విదేశ గమనానికి కొందరకు అవకాశం లభిస్తుంది స్త్రీలకు సాహిత్యపరంగా మీకు చక్కని అవకాశాలు లభించనున్నవి

★ **కన్య** : శుభకార్యానుకూలత, మిత్రుల వలన మేలు చేకూరుట, రాజకీయ సంబంధంగా అంతస్థు పెరుగుట, అప్రయత్న ధనలబ్ధి, ఆరోగ్య విధానాన పెంపు చేకూరుతుంది గమనించండి స్త్రీలకు నూతనోత్సాహం, ఉద్యోగ వృత్తులందు మేలు చేకూరగలవారం

★ **తుల** : చేసిన పనినే మరలా చేయవలసి వస్తుంది రాబడికన్నా వ్యయం అధికం కావటం గమనించదగిన అంశం చేసిన పొరపాటు మరలా చేయరాదని గ్రహించిన కొంతకాలం మీ పదవి దక్కుతుంది రాజకీయమే అయితే ఎంతో జాగ్రత్త వహించాలి, శ్రమించాలి స్త్రీలకు సర్వానుకూలతకు, ఉద్యోగమందు స్వల్ప అభివృద్ధికి అనుకూలం

★ **వృశ్చికం** : మీ యభివృద్ధికి అనుకూలం మీ వృత్తి వికసిస్తుంది నూతన విధాన మీకు ధనలబ్ధి, వ్యాపారం చేసేలాగైతే వెనుకు ముందు లాలోచించి సాగించాలి దైవబలానికి బాగా పాటు పడాలి ఉద్యోగమందు చికాకు కలుగుతుందేమో గ్రహించి మెలగాలి స్త్రీలకు కుటుంబానందం, హాయి ఆరోగ్యాభివృద్ధి

★ **ధనుస్సు** : చాలకాలంగా అనారోగ్యతతో బాధపడే వారికి కొంత ప్రశాంతత చిక్కుతుంది అయినా ఔషధ సేవ తప్పదు శ్రమించాలిగాని మీరు సత్కార్యాచరణ దక్షులని పేరు తెచ్చికొంటారు నూత్నోత్సాహ జనకమైనవారం స్త్రీలకు కుటుంబ సభ్యులతో తగదా తంటాలు రాకుండా చూచుకోవాలి

★ **మకరం** : చాలమందికి చిన్నవో, పెద్దవో ప్రయాణాలు చెప్పదగిన సమయం క్రయ విక్రయ నిమిత్తం కొందరు ప్రయాణించక తప్పకపోవచ్చు కోర్టులో వ్యవహారం ఏదైనా ఉంటే మీకు ఆ విధంగా యిబ్బందికరంగాదని గ్రహించాలి స్త్రీలకు గృహ నిర్మాణ వసతి ఏర్పడవచ్చు, ఆదాయమున్నది

★ **కుంభం** వివేకంతో ప్రవర్తించి, మీ కార్ఖానాలు, ఫ్యాక్టరీలు గనులు జాగ్రత్తగా చూచుకొండి బాగా శ్రమిస్తే లాభించే మార్గమున్నది మీ వస్తువులకు బాగా గిరాకీ తగులుతుంది అంతోయింతో ధనలబ్ధి స్త్రీలకు జీతమందు పెంపు ప్రమోషన్ యిత్యాది శుభ ఫలితములుండగలవు

★ **మీనం** : ఇటీవల ప్రయాణ తొందరలో మతిమరపు వలననో కొన్ని వస్తువులు పోగొట్టుకొన్నారుగా! వాటి ఆచూకి తెలియదుగాని, మరలా అట్టివి సేకరించు కొనుటకు యత్నించండి రాజకీయ రంగాన అనుభవంగల వారికి మంచి అవకాశాలు చిక్కుతాయి స్త్రీలకు యత్న కార్య సిద్ధి, ధనలబ్ధి, కుటుంబానందం

–విద్వాన్ కోట సత్యరంగయ్యశాస్త్రి

# సాగర్ స్కిమ్ మిల్క్‌తో ఆతిధ్యం

మీ యింటికెవరైనా రాగానే, గడపతొక్కి లోపలికి రాగానే, మీ అతిధులకి మీరు చేసే సత్కారం ఏమిటి? ఓ చిరునవ్వు, ఓ కప్పు టీ—అవునా? మరి పరంపరాగతంగా వస్తూన్నదది—మీ సంప్రదాయం, సంస్కృతి, ఆదరణ-వీటి చక్కని పరిణామ స్వరూపం.

మరి వాళ్లొచ్చేసరికల్లా మీ యింట్లో పాలు అయిపోయాయనుకోండి. మీకెలాగో యిబ్బందిగా అనిపించదూ? ఇక అప్పుడి కప్పుడు ఉన్న పళంగా పాలు రమ్మంటే ఎలా వస్తాయి గనక?

సాగర్ స్కిమ్ మిల్క్ పౌడర్, మరి మీ అమ్మగారి, అమ్మమ్మగారి నుంచీ తరతరాలుగా వస్తూన్న ఆ చక్కని సంప్రదాయాన్ని నిలబెడుతుందిక. అది గూడా పొదుపుగా, త్వరగా, తేలికగా. ఇక తీపి పదార్థాలూ, పుడ్డింగులూ అవీ చేసుకోవడానికి యిదెంతో బాగుంటుంది.




## సాగర్
## స్కిమ్ మిల్క్ పౌడర్

పాలలోని మంచిదనాన్నంతా యిస్తుంది, కొవ్వు పదార్థాలు లేకుండానే.



మార్కెట్ చేసేవారు:
గుజరాత్ కోపరేటివ్ మిల్క్ మార్కెటింగ్ ఫెడరేషన్ లిమిటెడ్
పోస్ట్ బాక్స్ 10, ఆనంద్ 388 001. గుజరాత్.

ASP/SMP/5/84 R



# ఎదపలికిన వేదం

యామినీ సరస్వతి

ఆరోజు ఉదయంనుంచి ఎదలోపల ఏదో తెలియని వేదన ఎందుకో తెలియని ఆవేదన మనసు లోలోపలి పొరల్లో ఎక్కడో దాగిన దుఃఖం - తొలకరి చినుకులకు పుడమి తల్లి గర్భాన్ని చీల్చుకుని వెలికి వచ్చే ఎచ్చి మొక్కలా బయల్పడాలని ప్రయత్నిస్తున్న సంధివేళ శ్రమిస్తే చెమట బిందువులు ముత్యాల సరాల్లా ముంగుర్లకి క్రింద నుదుటి భాగాన అలంకారంగా వెలసినట్లు దుఃఖానికి ప్రతీకగా వెలువడే అశ్రువులు కనుకొలకుల్లో ముత్యాల్లా వెలికి రాబోతున్నాయి

ఏమైంది యీ వేళ తనకి?

ఎందుకీ అకారణ దుఃఖచ్ఛాయలు!

పేగు తెగి క్రింద పడిపోయినంత బాధ!

మదిలో మెదలుతున్న దుఃఖ ప్రదిలి కదిలి కదిలి నదిలా సాగి వరదలా రేగి కడలిలా పొంగి పొంగి పోతున్నది ఇది తనని ముంచేస్తుందా!

అమ్మా! పుంబిష్ట తల్లీ! బిచ్చం వెయ్యమ్మా!

అల్లంత దూరాన గేటు-

ఆ గేటు కావల రోడ్డు దానిపై గేటు అనుకుని కడుపు నింపుకోవటంకోసం సాటిజీవి చేసే ఆక్రందన కడుపు పండిన బాలెంతరాలి ప్రార్థన!

హుం!

తనే ఓ దుఃఖ ద్వీపంలో వున్నట్టుంది యీవేళ

ఇపుడు యింకొకరి ఆర్తి తర్చే శక్తి తనలో లేదు

'మా లక్ష్మమ్మ తల్లీ! దయగల తల్లీ! ఓ చేతి బిచ్చం పెట్టమ్మా! బాలింతను తల్లీని ఎల్లనూ బ్రతికించు తల్లే!'

గుండెల్లో ఎక్కడైనా దాగివుంటే జాలిని కదిలించి పూటనిచేసి పూరడింపు పొందే విధంగాఅర్థిస్తున్నది

ఇది పరిస్థితులు పలికించే పలుకులా! లేకపోతే అడుక్కోవటం వృత్తిగా నేర్చిన నిత్య పోరాలా! జీవనయానంలో ఎదురయ్యే ఒడుదుడుకులు నేర్పిన కఠిన కఠోర సత్యాలా!

ఆమె ఆలోచనల దారం ఊహల గాలిపటం ఆధారంగా సాగిపోతున్నది

తల్లీ! దయతలచమ్మా! వేగి బిచ్చం ఎయ్యి తల్లీ!

కంఠంలో తొందర - ఆకలికి తాళలేనితనమో! మరో యిల్లు మరో యిల్లు వెతుక్కోవాలనే తొందరో!

దప్పున నుంచుంది వేదవతి

తన బాధలతో గాధలతో యితర్లని వేధించటం ఎందుకు

చేయి తిరిగ్గా లేదు వెళ్ళిరా! అని చెబితే వెళ్ళిపోతుంది తనకి లోపలికి వెళ్ళి అన్నమో, కూరో- బియ్యమో తెచ్చి వేసేంత శాంతి ప్రశాంతి లేవు ఊరకే తమ యింటి ముందు ఎందుకు పడిగాపులు పడనివ్వాలి! ఆలస్యంచేసి చేసి ఆఖర్న వూరకే పంపితే - పైకి కాకపోయినా - మనస్సులో నయినా తిట్టుకుంటారు కొందరయితే పబ్లిగ్గనే విను క్కుంటారు-

లేచి నుంచున్న వేదవతి కదిలింది

పాలపొట్టతో వున్న వరిపైరు వంగినట్లు నిండుగా పూసిన వెన్నముద్దలతో వంగిన రెమ్మలాగా

పండుగా కాసిన కాయల బరువుకి వంగిన కొమ్మలాగా ఆమెకి బరువనిపించింది నిండైన పొదుగుతో నడిచే కామధేనువులా నడిచింది

ఈ రెండు నెలలనుంచే రోజూనో – రోజు మార్చి రోజో డాక్టరు వచ్చి యింజక్షన్లు యిస్తూనే వున్నది తన క్లాస్ మేట్ – తన రహస్యాన్ని శాశ్వతంగా గుండెల్లో దాచుకునే ఆత్మీయురాలు డాక్టర్ జయంతి అయినా యీ 'బరువు ఆ 'బాధ' తప్పటం లేదు

మొగ్గ పూవై ఫలమయ్యాక కలిగే అనుభూతిని చెట్టు ఎలా దాచుకోగలదు?

తనకి ప్రకృతి ప్రసాదించిన వరాన్ని– సృష్టికి ప్రతి సృష్టి చేయగల ప్రకృతికి ప్రతికృతి స్త్రీకి దైవదత్తంగా దివ్యంగా లభించే ఏకైక అవకాశాన్ని– ఏ స్త్రీ తన నుంచి దూరం చేసుకోగలుగుతుంది!

తనో నిర్భాగ్యురాలు!

తను దౌర్భాగ్యురాలు!!

తనది అభాగ్య జన్మ!!!

సకల సంపదలూ వున్నా – అన్నీ అరచేతిలో లాగా అమరే అవకాశం వుండినా– సాంఘిక దురన్యాయం– పాతకాలపు కట్టుబాట్లు– పురుషాహంకారం చేసే వీర విహార వికృత కార్యం తనని యీ రోజు– యీ స్థితికి తెచ్చాయి

తలుపు తీసి– తలపులు ఆపి –నుంచుంది వేదవతి

అమ్మా దయగల తల్లీ!

ఆమెని చూడగానే బిచ్చగత్తె మళ్లీ అర్థించింది

అవును! ఈ యింటి ముందు నుంచి ఏ యాచకుడూ ఖాళీ చేతులతో వెళ్లరు వెళ్లలేదు అన్నపూర్ణ– తన తల్లి పేరు సార్థకం అయింది ఈ వీధిలో అడుక్కునే ఎవరికయినా యీ నీలిరంగు మేడలో స్వచ్ఛమైన అచ్చమైన చల్లని మనస్సున్న తల్లి వుందని తెలుసు

కానీ ఆ తల్లి తన విషయంలో మాత్రం

"అమ్మా! బాలింతరాలిని బిడ్డకింత ఆముదం ఓ అంగి బట్టో– నాకో రైకో– తలకో గుడ్డో– నడుం బిగించుకోడానికో పేలికో– లేకపోతే నువ్వు కట్టి విడిచిన చీరో– ఏదో ఒకటి

ముఖం తేటగా వుంది

నల్లని ఒత్తయిన జుత్తు సన్నని నడుము నిండైన వక్షస్థలము పచ్చని పసుపు పూసుకున్న బాలింత చిహ్నాలు

చంకలో

బంగారు వర్ణంలో పసిబిడ్డ తలకప్పేస్తూ చిక్కని తలకట్టు

బాబో – పాపో

ఏమిటి యీ ఎద అలజడి

ఆ చంకలోని బాబు ముఖం యిటు తిప్పాడు

లక్క పిడతలాంటి చిన్ని నోరు పెద్ద కళ్లు విశాలమైన నుదురు పాలుగారే బంగారు బుగ్గలు కెంపు ముక్కల్లాటి పెదాలు మొనతేలిన గడ్డం

ఆ బాబుని చూడగానే చంద్రోదయానికి వికసించే కలువలా పౌర్ణమినాడు పోటు పొడిచే సంద్రంలా ఆమె మనస్సులో ఏదో హాయి

చూడలేననుకున్నది చూచినట్లు –పొందలేననుకున్నది పొందినట్లు – ఏ జన్మలోనో తప్పిపోయిన వస్తువు యీ జన్మలో తనకై తను లభించినట్లు– అంతులేని ఆనందం

తదేకంగా చూసింది వేదవతి

ఆమె అలా బిడ్డను చూస్తోందే ఎక్కడ దృష్టి సోకుతుందో అన్నట్లు ఆ బిచ్చగత్తె పైటి కప్పింది బాబు పూర్తిగా పైట చెంగు చాటుకి పోలేదు పూర్ణ శశిని సగం మాత్రమే కప్పగలిగిన చిరుమేఘంలా వుంది పైట

లోపలికి రా!

బిచ్చం వేయలేనని చెప్పటానికి వెళ్లిన వేదవతి పిలిచింది

పెద్దిల్లు పెద్దింటి ఆడపడుచు ప్రేమగా చూస్తోంది కన్నతల్లిలా భిక్షం పెడుతుంది బట్టో పాత్రో యిస్తుంది ఆశతో వచ్చింది లోపలికి

ఏం పేరు?

లక్ష్మి!

చప్పిన పెదాలపై చిరునవ్వు రాబోయి ఆగింది పూట పూటకి తిండికోసం యాతనతో యిల్లిల్లు అడుక్కుంటూ తిరిగే యీ యువతి లక్ష్మి

అవును నిజమే లక్ష్మి యిల్లిల్లూ తిరుగుతూ వుంటుంది కదా! ఒక చోట బంధిస్తే– నిలిస్తే నిలిచేదా! వుండేదా! దాస్తే నల్లనై పోతుందా బంగారు తల్లి

ఎవరు బాబా? పాపా?

మగపిల్లాడే నమ్మాయిగారూ! పెరాశతో అంది

ఏం పేరు?

క్రిష్ణయ్య

ఎన్నెల్లు!

మూడో నెల నిండిందమ్మాయి గారూ!

కూర్చో లోపలికి వెళ్లొస్తాను!

మీ దయమ్మాయి గారూ!"

లోపలికి వెళ్లింది వేదవతి

తల్లిని అడగలేదు తన గదిలోకి వెళ్లింది ఓ మాత్రం పాతబడిన చీర, లంగా, రవిక, తువ్వాలు తీసింది బాబుకి యిచ్చేందుకి యీ యింట్లో అంతటి చిన్నారి ఏడీ?

ఆమె గొంతులో దుఃఖం సుళ్లు తిరిగింది

నాభి నుంచి దుఃఖం తన్నుకొచ్చింది

అన్నీ సక్రమంగా వుంటే–

ఆ బంగారు బాబు– ఏ లోకాల్లో వున్నాడో – బ్రతికే వుంటే యిప్పటికి యీ యింట్లో వూయల లూగేది ఆనందం ఉరకలు వేసేది సంబరం ఎన్నెన్ని రకాల చొక్కాలు నగలు ఆడుకోటానికి బొమ్మలు పడుకోటానికి పరుపు వూగేందుకు వూయల

ప్చ్! తనో దౌర్భాగ్యురాలు!

తన కంత అదృష్టమా!

బిచ్చగత్తె అయినా తన యీడున్న ఆ అమ్మాయి అదృష్టవంతురాలు

ఆడజన్మని సార్థకం చేసే మహత్తర మాతృత్వ భాగ్యం పొందింది

పిల్లాడిని ఒళ్లో వేసుకుని– బిచ్చమెత్తుకుని అయినా పోషిస్తోంది తనూ వుంది!

ఎందుకు! తన జన్మ నిరర్థకం! చదువుకుని,



మాతరన్ ప్యూస్ వుంది, అల్రా మాడరన్ వాతావరణంలో పెరిగి ఆఖరిక

చి' చి' అనుకోటానికే సిగ్గుగా వుంది

బయటికి నడిచింది వేదవతి

గది గడప దాటబోతూ వుంతగా పొత్తి కడుపు పైభాగంలో ఏదో చల్లగా జిడ్డుగా మృదువుగా ఎండ తాపాన్ని సైతం శతలమయం చేసేట్టు చల్లగా చేత్తో తడుముకుంది

బ్రా తడిసిపోయింది చివర్లంతా చల్లగా జిగురుగా

క్షణ కాలం సిగ్గు – విభ్రమం

పదాలు తడబడ్డాయి

ఆ బిచ్చగత్తె ముఖం చూళ్లాలనిపించింది

అయినా మళ్లీ ఆ పండుబొమ్మని చూతవచ్చని గబ గబా వచ్చింది

ఖాళీ పండా బోలు నోరులా లేడిని మింగిన పులి నోరులా లేగదూడని గటుక్కుమని నోట్లో వేసుకున్న సింహంలా కొలనులో కాళ్లు కడుక్కోనేందుకు వచ్చిన పిల్లాడ్ని పొట్టన పెట్టుకున్న మొసలిలా

ఉస్సురుమంటూన్న మనస్సుని ఓదార్చుకుని గేటుదాకా వచ్చింది

అల్లంత దూరంలో ఆ బిచ్చగత్తె

'లక్ష్మీ!'

ఆమెకే వినిపించేంత గట్టిగా పిలిచింది

అన్నపూర్ణమ్మ గారు పళ్లెం నిండా అన్నం కూరలు పెట్టగానే వెళ్లిపోయింది ఆ బిచ్చగత్తె పిలుపు విని తిరిగి చూసి, వేదవతి చేసైగ వెంట వచ్చింది చప్పున

ఇంద!

తను తెచ్చినవి యిచ్చింది

'చల్లని తల్లి! మాయమ్మ ఎంత దొడ్డ మనసు! పిల్లా పాపల్తో చల్లగా వుండమ్మా!' దీవెనలాగా అంది

గుండె పగిలిపోయేంత దుఃఖం వచ్చింది వేదవతికి

మరోసారి బాబుని చూసింది

గుమ్మడి పువ్వులా, జిల్లేడు పూగుత్తిలా

ఎంతందం!

ఏ కలవాళ్లింట్లోనో జన్మ యివ్వరాదూ ఆ భగవంతుడు! తనకే కడుపు నిండని స్థితిలో వున్న యీ యువతి కడుపిలా పండించాలా? ఏమిటి భగవంతుని సంకల్పం! సృష్టి చిత్ర విచిత్ర మ్మేళనం చేయటమేనా ఆయన నిత్యకృత్యం!'

బిచ్చగత్తె వెళ్ళేదాక అలాగే చూస్తూ లోపలికి వెళ్లింది వేదవతి

ఆమె బ్రాసరీ, జాకెట్ మార్చేసి, ఎవరూ చూడకుండా బాత్‌రూంలోని బకెట్‌లో పడేసింది

★ ★ ★ ★ ★

మనిషి మేల్కోటానికి అలారం కావాలి!

# ఎదపలికిన వేదం

మనసు మేల్కోటానికి అనుభూతి కావాలి! అనుభవమూ కావాలి

వేకువనే పక్షులు కలకల రవం చేస్తూ లేస్తాయి ఆ కలకలారావాలతోనే జనమూ జగతీ మేల్కొంటుంది

అది నియతి

రోజూ ఉదయం ఎనిమిది దాటీ దాటక ముందే ఆ బిచ్చగత్తె లక్ష్మి ఆ వీది మొగసాల్లో వుంటుంది

ఆ తర్వాత అయిదారు నిమిషాలకి అటూ యిటూగా ఆ యింటి గేటు కిర్రు మంటుంది

మేఘగర్జనకి ఎదురు చూసే నెమలిలా – చంద్రోదయానికీ చంద్రికావర్షానికీ తపించేలా చాతకం లా ఆ కిర్రుమనే గేటు చప్పుడు కోసం తనువునంతా శ్రవణేంద్రియంగా మార్చుకుని – ఆ తర్వాత అరనిముసానికి మనసంతా కళ్ళు చేసుకుని వచ్చి ఆ పైడిబొమ్మని చూస్తుంది వేదవతి

ప్రతిరోజూ ఆ బిచ్చగత్తె వెళ్లిన తర్వాత బ్రా జాకెట్ మార్చివేయవలసిందే

లేగదూడ ముట్టి సోకీ సోకగానే జల్లున చేపే గోమాతలా ఏమిటి వింత అనుభూతి!

పోగొట్టుకున్న శిశువుకు దక్కని స్తన్యం యిలా వరదపాలయ్యే ఏరులా పొంగి పోతూ వుండవలసిందేనా?

అర్థం కావటం లేదామెకి

రోజూ లక్ష్మికి డబ్బిస్తున్నది మంచి తిండి కోసం – బలమైన ఆహారం కోసం – బాబుకి బట్టలు కొనుక్కోమంటూ ఓ రోజు ఇరవైరూపాయలిచ్చింది

మరు రోజు పాత బట్టల గుట్టలో ఎంపిక చేసి లక్ష్మి కొని తెచ్చిన నల్ల చొక్కాలో బాబు మసి పాత్రలో మాణిక్యంలా కన్పించాడు

'ఏమే! పాతగా వుంది చొక్కా!'

'అవునమ్మా! పాత గుడ్డలమ్మే వాని దగ్గర కొన్నా!'

చివుక్కు మంది వేదవతి మనసు సిల్కు గుడ్డల్లో శోభించ వలసిన రూపం పాత గుడ్డల్లో మరుగు పడి పోవాలా! వీళ్ల అడుక్కు తినే బద్ధి పోనివ్వలేదు తను డబ్బు యిచ్చింది ఆయినా కొనటానికి మనసు రాలేదు– ఏం మనిషి

లక్ష్మి యీ భావన గ్రహించినట్టుగా 'అమ్మా! కొత్త చొక్కా కొనుక్కుని తొడిగినా ఎక్కడ్నో దొంగ తనం చేసిందంటారు జనం దయగా నువ్వు డబ్బులిచ్చినా అందుకే కొత్తవి కొన్లేదు అయినా కొట్టుకు పోయి బేరం చేస్తే బిచ్చగాళ్లని చూసి నవ్వుతారు నాలాటి దాన్ని చూస్తే యిగిలిస్తారు ఇంకా పోకిరి చూపులు చూస్తారు–' అంది బాధగా

'అవును' లోకరీతి లోకనీతి ఎంత బాగా చెప్పింది బియ్యే పాసైన తనే లోకానికి భయపడింది ఆస్తి అంతస్థు వున్న తనూ, తలిదండ్రులే సంఘానికి జడిశారు 'ఆప్టరాల్– ఓ బిచ్చగత్తె – అండా ఆపూలేని యువతి భయపడటంలో వింతేముందిలే' అనుకుంది

సరేలే' అంది పైకి

బిచ్చం తీసుకుని, దండం పెట్టి వెళ్లి పోయింది

కదులుతున్న ఆలోచనలు– రగులుతున్న ఎద– మరుగుతున్న వేదన– వేదవతిని యింట్లోకి నడిపించాయి

★ ★ ★ ★

లక్ష్మి!'

ఆరోజు సాయంకాలం కూడా రమ్మంటే పిల్లవాడిని ఎత్తుకుని వచ్చింది లక్ష్మి వరండాకి అటు వైపు వీధిలోకి కనిపించని చోట కూర్చున్నారిద్దరూ

లక్ష్మి ఒడిలో బాబు కుర్చీ ఒడిలో వేదవతి

'వీళ్ల నాన్న పోలికా బాబూ?'

'కాదమ్మాయి గారూ! మా పెనివిటి నల్లగా – వుంటాడు –'

లక్ష్మి కూడా ఛామన ఛాయే!

వేదవతి ఆశ్చర్యపోయింది జన్యుశాస్త్రం ఒక్కోసారి వింత వింత తీర్పులు చెబుతుందేమో!

'అమ్మాయి గారూ!'

'ఏమిటి లక్ష్మి!'

'మీకు ఎందుకింత ప్రేమ!'

ఉస్సురని నిట్టూర్చింది ఏం చెబుతుంది! లక్షాధికారి కూతురయి వుండీ తను పొందలేని భాగ్యం యీ బిచ్చగత్తె పొందిందని చెప్పుకో గలుగుతుందా!

'లక్ష్మి! ఈ బాబుని నా కిచ్చేస్తావా! నే పెంచుకుంటానే! చూడు నీ దగ్గరే వుంటే వీడూ వీడి బాబులాగా 'సుద్దులు' చెప్పుకుంటూ బతకాలి! ఊరూరా, యిల్లిల్లూ తిరిగి జీవనం గడపాలి చదువు, ఉద్యోగం, సంస్కారం, చక్కని యిల్లు, సంసారం యివేవీ వుండవు –'

'అమ్మో!' గుండెలకి హత్తుకుంది నే నివ్వను అమ్మాయిగారూ!' అంది భయం భయంగా రోజూ! మీరు ప్రేమగా యింతిస్తున్నారని నేను రావటం లేదు నా దేవుడ్ని చూసి మురిసిపోతన్నారని వచ్చి చూపించి పోతున్నా! గుళ్లోకెళ్లి దండం పెట్టుకుని అంతోటి వుర్కోక విగ్రహాన్ని ఎత్తుకెళ్దామనుకుంటే ఎల్లాగమ్మా!' అంది నిష్టూరంగా

'ఛ! ఛ! నాకంత దురాశ లేదే! చుక్కల్లో చంద్రుడులాగున్న యీ బాబుని చూసి ముచ్చట పడి సాక్కుని చదివించి మంచి సంస్కారం నేర్పి నా కొడుకుగా తీర్చిదిద్దాలనుకున్నాను అంతే!'

'అలా గడక్కండమ్మాయిగారూ!' కొడుక్కు పాలు కుడుపుతూ అంది

'పాలు చాల్తున్నాయటే!' చాలవంటే 'తన స్తన్యం' ధారపోస్తానన్నంత ఆవేగంతో అడిగింది

'బాబు అన్నీ తాగ లేడమ్మా! యింకా మిగిలే నొప్పులని నొక్కేసా! బలవంతంగా పడ్తే అజీర్తి చేస్తదంట!' అంది

# ప్రేమ్ సబ్బుతో స్నానం రోజంతా ఉల్లాసం

మీ శరీరమునకు మృదుత్వమునిచ్చి సహజ
సౌందర్యమును పెంపొందించు సబ్బు ప్రేమ్.
దీని స్వచ్ఛమైన నురగ, పరిమళము
మీ మనసును పులకింపజేయును.




గులాబి మఱియు ఆకుపచ్చ
రంగులలో లభించును.



జయలక్ష్మి
గుంటూరు వారి తయారీ

లక్ష్మిని అప్పుడు చూసింది! కామధేనువులా అన్పించింది లక్ష్మి

అలాగే బాబుని తన్మయంగా చూస్తోంటే మళ్ళీ బ్రాసరీ తడిసిపోయింది

'లక్ష్మీ 'నీ బాబుని ఒక్కసారివ్వవే!' అంది

లక్ష్మి అందించింది

మళ్ళీ జన్మలో అవకాశం రాదన్నట్టుగా గుండెలకేసి హత్తుకుంది ఎద తీయని రాగం తీసినట్టు తొలిసారి మాతృత్వం పరిమళించినట్టు ఎద లోపల యమునా నది తీయని పరుగులు తీసినట్టు

ఎంత హాయి

చేజారిన వజ్రం ముక్కలు కాకుండా చిక్కినట్టు

'అమ్మాయిగారూ! మిమ్మల్ని చూస్తోంటే ఏమనిపిస్తోందో చెప్పనా!'

ఉలికి పడింది

'తొలిచూలు బాలెంతరాలు మొదటిసారి బిడ్డనెత్తుకున్నట్టున్నారు!' అంది

వేటగాడి బాణం సూటిగా వేడి గుండెల్లో నాటుకుంది

వెక్కివెక్కి ఏడ్వసాగింది వేదవతి

బిడ్డ చెక్కిళ్ళు ముద్దాడుతూ, గుండెలకేసి హత్తుకుంటూ. కర్ణుడిని చూసిన కుంతిలా శకుంతలని వీడి పోయే మేనకలా

# ఎదపలికిన వేదం

లక్ష్మి గుండె కదిలింది దాని ఎదలో ప్రేమ ప్రిదిలింది అది ప్రవహించింది

'అమ్మాయిగారూ! ఈ బిడ్డని మీకే యిచ్చేదాన్నే! కానీ అమ్మాయిగారూ' – నాకూ పుట్టగానే కన్ను మూసిన నా బిడ్డ పోయిన దుఃఖం నుంచి తేరుకోక ముందే దేవుడిచ్చినట్టు యీ బిడ్డ డబ్బు - మూట లాగా దొరికినాదమ్మాయిగారూ! కన్నప్రేమ కంటే పెంచిన ప్రేమ ఎక్కువయిందమ్మాయిగారూ – అందుకే– అందుకే '

ఆశ్చర్యంగా అడిగింది వేదవతి

'ఈ బాబు నీ బిడ్డ కాదూ!'

తలాడించింది అడ్డంగా 'దొరికినాడు ఈ వూరు రాక ముందు ఓ వూళ్ళో ఓ నాలుగంతస్తుల మేడ నీడలో నేను ఏడుస్తా పడుంటే ఈ బిడ్డను గుడ్డల్లో చుట్టి మెత్తని తాడుతో మేడ మీది నుంచి కిందికి దించి నా రమ్మాయిగారూ! దువ్వముడేసి బిడ్డ దిగ్గానే తాడు చేదుకున్నారు –

'ఏ వూరూ? ఏ వీధి? ఏ మేడ!' ప్రాణాలన్నీ ఆ ప్రశ్నల్లో దాచి అడిగింది

'ఏవూరంటే–' చెప్పింది మెల్లిగా 'వీధి ' అదీ వివరించింది మేడ 'ఆ గుర్తు చెప్పింది

ఏ బంగారు మొలకో కనేసి కన్నబిడ్డని చెప్పుకోలేక యిలా యిడచింపనుకున్నా! పోయిన నా బిడ్డే యీ రూపంలో భగవంతుడిచ్చినాడనుకున్నా!'

వేదవతి కన్నీరు మున్నీరుగా ఏడుస్తోంది

బాబుని పదే పదే ఎదకేసి హత్తుకుంటుంది బుగ్గలు కందేలా ముద్దాడ్తోంది

రహస్యం బయటికి రాబోతుంది ఆగిపోతోంది ఆఖరిక గరళంలా కంఠంలోనే ఆగింది లక్ష్మి బాబునెత్తుకుని వెళ్ళిపోయింది శూన్య దృక్కుల్లో నుంచని పోయింది వేదవతి

★ ★ ★ ★ ★

నాన్నా! అమ్మా! ఇది నా నిర్ణయం

మీరు కాదంటే మీకు మీ బిడ్డ దక్కదు

నేను చచ్చిపోను ఎటో వెళ్ళిపోతాను మీ కూతురేమయిందో మీరు ఎవరికో చెప్పుకోలేక అవమానంతో వియోగంతో కుమిలి కుమిలి పోతారు

మీకు మీ బిడ్డ ఎంతో – నాకూ నా బాబు అంతే!

పుట్టగానే బాబు చనిపోయాడన్నారు! నెలలు నిండలేదన్నారు! వికారంగా వికృతరూపంలో, అంగ విహీనంగా పుట్టాడన్నారు నుదుట కన్నుందని వెనుక తోకలా మరో కాలు మొలిచిందని, ఆరు వేళ్ళని, చెప్పారు ఎక్కడో సకృత్తుగా జరిగే విపరీత సృష్టి జరిగిందన్నారు

పాప ఫలితంగా ఫలించిన పాప పాపం రూపె పొందిదన్నారు అందుకే బ్రతికినా చంపెయ్యాల్సి

నంత వికారపు బిడ్డ చచ్చి పుట్టాడని చెప్పారు

నేనూ గుండె రాయి చేసుకున్నాను

హ్యూమానిటీస్ చదివిన నేను హ్యూమన్ సైకాలజీ తెల్సుకోలేకపోయాను నాన్నా!

మీరు నన్ను-కన్నబిడ్డను అబద్ధం చెప్పి మోసం చేస్తారని మోసగించగలరని అనుకోలేదు

నిజం చెప్పండి! మా కన్నబిడ్డ తలమీద చెయ్యేసి ఒట్టేసి చెప్పండి

నాబాబు అంత వికృతంగా పుట్టి చనిపోయాడా?

ఆరాత్రి తల్లీ తండ్రీని నిలవేసి అడిగింది వేదవతి

పాపా! జరిగిపోయిందాన్ని గురించి ఎందుకమ్మా యీ చర్చ!'

నిజం తెల్సుకోవాలినాన్నా! పరువూ ప్రతిష్ఠల కోసం మీరు నిలువునా ఓ శిశువుని- అప్పుడే కళ్ళు తెరిచిన లేత గులాబి మొగ్గని తుంచెయ్య గలరని నమ్మలేక అడుగుతున్నాను-'

ఆయన జవాబివ్వలేదు

మోహన్‌పై వ్యామోహం నాకళ్ళు కప్పింది అతనంత అందంగా నన్ను దగా చెయ్యగలడని నేననుకోలేదు అతడి నీచత్వాన్ని అసహ్యించు కున్నాను అలాంటి నీచుడ్ని దగ్గరికి చేర్చుకోవటం యిష్టం లేక ఆ మోసగాడితో జీవితం పంచుకోవటం యిష్టంలేక అన్ని ఆధారాలున్నా కోర్టుకు లాగి, నాకన్యత్వాన్ని భంగ పరిచి నన్ను తల్లిని చేసిన నేరానికి జైలుకు పంపలేకపోయాను అక్కడా మనస్సూ పరువూ ప్రతిష్ఠ అడ్డం వచ్చాయి-

కానీ నారక్తం పంచుకుని నాకడుపు చీల్చుకుని పుట్టిన ఆబిడ్డలో నారక్త మాంసాలున్నాయి! వాడిని నాశిక్షణలోనే శిశువుగా పెంచుకునే దాన్ని-లేదా ఏ అనాధాశ్రమానికో యిచ్చేసి కొన్నేళ్ళు గడిచాక జీవితంలో స్థిరపడ్డాక తెచ్చి పెంచుకునే దాన్ని

మీకు తెలుసు-నేనెంత మొండిదాన్నో-

ఇంత రామాయణం అయ్యాక మళ్ళీ కన్నెపిల్లలా మరో మగాడ్ని మోసపుచ్చి అతనితో జీవితం పంచుకోలేనని అవివాహితగానే వుండిపోతాననీ ఆనాడే చెప్పాను

మీరూ అంగీకరించారు!

ఇపుడు నాబిడ్డ గురించి చెబితే- నా అంధకారం బతుకులో వెలుతురు కన్పించే మార్గం వుంది!

కొద్ది నిమిషాల నిశ్శబ్దం

మీ మేనమామ ఆరోజు ప్రసవం కాగానే చెప్పుకుంటూ పోయాడు ఆయన

పావు గంట గడిచింది

అన్నపూర్ణ ఏడుస్తున్నది ఆయనా దుఃఖిస్తున్నాడు

కానీ వారికి విరుద్ధంగా నవ్వింది వేదవతి

తనదైన బ్రతుకుమార్గాన్ని నిర్దేశించుకున్న వేదవతి

నాన్నా! అమ్మా! నాబిడ్డ బ్రతికే వున్నాడు వాడి




కడుపు చల్లదనం కోసం నాస్వత్వం మిగిలినట్టే నాకడుపు చల్లగా వాడు హాయిగా వున్నాడు వాడిని నేను రేపే తెచ్చుకుంటాను ఆ జన్మరహస్యం తెలిసింది ఆ యిల్లాలికి ఎంతయినా ఎంత విద్యగత్తె అయినా ఆమెకూడా స్త్రీ మాతృమూర్తి

ఆ బాబుని పెంపకంలాగా తెచ్చుకుంటాను

అపుడు మీ గౌరవ ప్రతిష్ఠలకి లోపం వుండదు నామాతృత్వానికి లోటుండదు. వాడికి కన్నతల్లి ప్రేమ దూరంకాదు నాన్నా! ఇది నానిర్ణయం! నావిద పలికిన వేదం! వేదానికి తిరుగులేదు అది శాసిస్తుంది మీ కన్న కూతురుగా యీ వేదవతి కూడా అర్థింపు రూపంలో శాసిస్తుంది! మనస్సుకి మించిన ధర్మశాస్త్రం లేదుకదా!

అలాగే తల్లీ! నువ్వు మాకెంతో - నీకూ నీ బిడ్డ అంతే! కూతురి నిర్ణయంతో ఏకీభవించి, రేపటి దాకా ఆగలేని ఆయన అప్పుడే లేచాడు మనవడి కోసం. □




**ఎమ్. ఎస్. కె. బొంబాయి.**

కె రా గారూ మనం ప్రేమించే వాళ్ళకంటే మనని ప్రేమించిన వారిని పెళ్ళి చేసుకోవాలి అంటారు నిజమా?

★ ఒకరి నొకరు ప్రేమించు కుంటేనే– పెళ్ళిదాకా వచ్చేది

మీది ప్రేమ వివాహమా?

★ అవును

**జి. హెచ్. ఆర్. కాకినాడ.**

పువ్వు లెందుకు అందరినీ ఆకర్షిస్తాయి?

★ వాటికి భాష రాదు మౌనం గంభీరంగా వుంటుంది. అవేం అనుకుంటున్నాయో మనకి తెలియదు అంచేత– ధైర్యంగా– ఎంత బాగున్నాయో అనగలం

**వి. ఎమ్. ఆర్. మహబూబ్ నగర్.**

★ రామలక్ష్మి గారూ నేను నిన్ను ప్రేమిస్తున్నాను నువ్వే నా సర్వస్వం నువ్వు లేనిదే బ్రతక లేను అనే మాటలు నల్గురిలో చెప్పే అమ్మాయిని ఏమనాలి?

● నాటకంలో పోర్షన్ ప్రాక్టీసు చేస్తోంది అనుకోవాలి

**టి. ఎస్. భిలాయి.**

★ మీరు చక్కగా జవాబులిస్తుంటారు ఒకోసారి నవ్వు వుంటాము ఒకోసారి తల పోటు వస్తుంది

● అంతే– నేను ఆశించేది!

★ మీ తల్లి తండ్రులు మీ పేరు మరిచి పోయి పెట్టినట్టున్నారు రామావతారానిక లక్ష్మి ఎటాచింగు ఏమిటి? మీకు బాగుందా?

● బాగుంది ఎటాచింగు వల్ల కాదు– అది మా అత్తయ్య పేరు అని!

**ఇ ఎస్ ఆర్. ఖమ్మం.**

చదువుకొనే డబ్బు సంపాదించడం గొప్ప అంటారా? వ్యాపారం చేసి డబ్బు సంపాదించడం గొప్ప అంటారా?

● డబ్బు సంపాదించ కల్గడమే – గొప్ప విషయం బ్రదర్ ఈ రోజుల్లో అదెలా సంపాదించారు అని అడిగే చాందసులు లేరు!

**కె. వి. భిలాయి.**

★ మీ ఇష్ట దైవం ఎవరు?

● దైవం ఏరూపంలో వున్నా ఒక్కడే కద

**కళ్యాణి. బెండమూర్లంక.**

★ అక్కయ్యా ఈ రోజుల్లో కుర్రాళ్ళకి ప్రేమించడానికి ప్రేయసికి ఎంతో గొప్పగా కబుర్లు చెప్పడానికి సినిమాలక షికార్లకి రమ్మనడానికి వుండే ధైర్యం పెళ్ళి చేసుకుంటానని తల్లి తండ్రులకి చెప్పే టైముకి మటుకు పిరికి వారుగా తయారవు తున్నారు ఆ ధైర్యం ఎక్కడికి పోతుంది? ప్రేయసికి ఆశలు కల్పించి చేతకాని వాడిలా పలాయనం చిత్తగించే మగరాయిళ్ళను ఏం చేయాలి?

● అది వాళ్ళ నైజం అది తెలిసీ 'ప్రేయసి గారి బుర్ర ఏమై పోయింది? ఆ సినిమాలకి షికార్లకి కర్చు పెట్టే డబ్బు అతని తల్లి తండ్రులదని తెలియదా? ఎవరైతే యింకొకరిపై ఆర్ధికంగా ఆధారపడి వుంటారో వాళ్ళక స్వతంత్రం ఎక్కడిది! సరదాగా ప్రేమిస్తారు తల్లి తండ్రుల మాటవిని కట్నం కానుకలతో కళ్యాణానికి సిద్దం అవుతారు సినిమాలకి, షికార్లకీ ప్రేమ కబుర్లకి సిద్ధమై పోయే అమ్మాయిల విలువలు– వాళ్ళూ గ్రహిస్తారు అందుకే ప్రేమ– ప్రేమించడం అల్లాటప్పా వ్యవహారం కాదు చాలా సీరియస్ విషయం అనడం

**కె. బి. హెచ్. ఆర్. టాటానగర్.**

స్త్రీలు పెండ్లి అయిన తరువాతే మగవాడిని ప్రేమించేవారు ఇప్పుడు పెళ్ళికి ముందే ప్రేమించుకుంటున్నారు?

● కాలం మారింది – మోజు గమనించలేదా! □

సీరియల్

# మౌన నివేదన

ఆర్. పద్మజ చౌదరి

(గత సంచిక తరువాయి)

మామయ్యా !

తొలిసారిగా, తుదిసారిగా నా గుండెల్లో గాఢంగా నాటుకున్న ఆశల్ని, అపోహల్ని నీ ముందుంచడంలో అర్థంలేదని యెరిగున్నప్పటికి వ్రాయకుండా వుండలేకపోతున్నాను. అమ్మమ్మతో యీ యింట బిక్కు బిక్కు మంటూ అడుగు పెట్టిన నాటి నుండి, యీ క్షణం వరకూ గతాన్ని పునరావృతం చేసికుంటే నాకు మిగిలింది ఆద్యంతాల మధ్య నున్న శూన్యమేనని స్పష్టమయ్యింది. అంధకారంలో నిలబడి వెలుతురుకై వెతుక్కుంటున్న తొలి క్షణంలోనే అమమ్మ నాకు ఆశ్రయమిచ్చింది. ఆ ఆశ్రయంలోనే నా బ్రతుకు బాట మలుపు తిరిగింది మామయ్యా. అమ్మ బ్రతికున్న రోజుల్లో మీ గురించి తరచు చెప్తూ వుండేది ఆమె మాటల ప్రభావం వల్ల మీతో పరిచయం ఉన్నట్లే అనిపించేది బహుశా అందు వలనే అనుకుంటాను మామయ్యా యీ యింట్లో నేను త్వరగానే యిమిడి పోయాను ప్రపంచంలో అమ్మ ప్రేమ తప్పించి చవిచూడని నేను యీ చల్లని నీడన లభించిన ఆదరణకు ఆశ్చర్యపోయాను

చాలా రోజులు యిక్కడ నా జీవితం స్తబ్దుగానే గడచిపోయింది నిన్ను చూచిన తొలి క్షణం నుండి నీ పూజకై యీ గడ్డిపువ్వు విని

**జరిగిన కథ-18 :** అక్క కూతురు రాజ్యలక్ష్మి చనిపోవడంతో ఆమె కూతురు ప్రభాతను తన ఇంట్లోనే ఉంచుకొంటుంది ప్రభావతమ్మ. రామస్వామి, ప్రభావతమ్మల పెద్ద కొడుకు కృష్ణ చైతన్య. అతనికి ప్రభాతంటే అమితమైన అభిమానం. కృష్ణ చైతన్య చిన్ననాటి స్నేహితుడు శరత్. శరత్, రాధలు ప్రేమించుకొంటారు. అజంతా, ఎల్లోరా వెళ్లినప్పుడు అక్కడ కృష్ణ చైతన్య రమేష్, ప్రభాతలకు డా॥ విద్యను పరిచయం చేసాడు. రమేష్ డా॥ విద్యను తను ప్రేమిస్తున్నట్లు కృష్ణ చైతన్యకు ఉత్తరం రాసాడు. రాధ పెళ్ళి శరత్‌తో జరిగి పోయింది. డా॥ విద్య తాను మాతృత్వాన్ని పొందలేనని, కృష్ణచైతన్యకు ఉత్తరం రాసింది. కృష్ణ చైతన్య మిత్రుడు రవి వచ్చాడు. రవికి బిజినెస్ వ్యవహారాల్లో సహాయ నిమిత్తం మద్రాసుకు వెళ్తున్నానని చెప్పి, వెళ్లివచ్చిన కృష్ణచైతన్య ముభావంగా ఉండటం ఇంటిల్లిపాదిని ఆశ్చర్య పరిచింది. మామయ్యలోని మార్పు ప్రభాతలో సంచలనాన్ని కలుగ జేసింది. కృష్ణచైతన్య పెళ్లి డా॥ విద్యతో జరిగిపోయింది. ప్రభాత రోజ్‌లిన్ తండ్రి సహాయంతో అనాధ శరణాలయంలో ఉద్యోగంలో చేరను నిశ్చయించుకుంది. ఆమెకు ఆ ఉద్యోగం వచ్చింది. కృష్ణచైతన్య డైరీలో అతను తను తండ్రిని కాలేనని రాసుకున్న వాక్యాలు చదివి మామయ్య తొందరపడ్డాడని దుఃఖించింది ప్రభాత.

యోగింపబడాలని వాంఛిస్తున్నదని నేను నీకు ముందెప్పుడూ చెప్పలేదు కదూ ! మొదట్లో నువ్వు నన్ను గమనించీ గమనించనట్లుండేవాడివి. అలాటి నిన్ను కేవలం ఆరాధించడంతోనే తృప్తి చెందాను. కానీ, నిశ్శబ్దంగా సాగుతున్న నా జీవితంలోకి సందడి నువ్వేతెచ్చావు మామయ్యా! నీకెందుకనిపించింది నాకు చదువు చెప్పాలని? నీ వెందుకు కోరుకున్నావో గానీ నన్ను సంస్కరించాలని; నీలో కలిగిన ఆ కోరికే నాలో అలజడి రేపి నన్ను ఎండమావుల వెంట వురకలు పెట్టించింది. నీ కోసం చదువు ప్రారంభించిన నేను, నాకే తెలియకుండా నాటుకున్న ప్రేమ బీజం మొలచి, పెరిగి పెద్దదవడాన్ని చాలా ఆలస్యంగా గుర్తించాను. గుర్తించిన నాడు ని చేత ప్రేమించబడుతున్నానని గూడా భ్రమశాను ఆ భ్రమలో యెంతో కాలం గడిపాను.

నిజానికి నేనింకా సందేహంలోనే సతమతమవుతున్నాను. నువ్వు నన్ను ప్రేమిస్తున్నావన్న నా భావన కేవలం భ్రమేనంటావా? అందులో సత్యం లేదని నీవు గట్టిగానే అనగలవా ! మామయ్య! వొక్క మాట, నా మీద కేవలం జాలితోనే ప్రవర్తించావా? సంస్కరించాలన్న ధ్యాస తప్ప నాలో రేగే వూహలను గుర్తించలేదా ! నాకలాంటి ఆశలు కలుగుతాయని నీవనుకోలేదా? అలా నేను భావిస్తే నా అజ్ఞానం అనుకున్నావా? అసలు నువ్వేమనుకున్నావు ? నీ ప్రతి పనీ నాలో ఆశల్ని పెంచుతుందని నీవు గ్రహించలేదా ? అంత పెద్దవాడివి, చదువుకున్న వాడివి నువ్వు గ్రహించలేదంటే నా కాశ్చర్యంగా వుంది పోనీలే, మామయ్య. ఆశల్ని చంపుకుంటాను. మమతల మాలను తెంపు కుంటాను. నన్ను చూస్తుంటే నీకు చాలా గర్వంగా వుంటుందికదా మామయ్యా. ఎందుకుంటే నీ చేతిలో మలచబడ్డ శిల్పాన్ని, నీచేత సంస్కరించబడ్డ అనాగరిక అతివను. నువ్వు అందమైన కుండిలో అమర్చిన గడ్డిపువ్వును. నన్నెందుకు శిలగా వుండనీయలేదు ! నన్నెందుకు నా అజ్ఞాతంలోనే బ్రతకనీయలేదు? నన్నెందుకు అడవిలోనే వుండనీయలేదు. నన్నెందుకు స్పందింపజేశావు? నాలో అనురాగాన్ని నింపి, చివరకు నా మనసును నిర్దయగా నలిపివేశావు: నా చిన్న పరిధిలోనుంచీ నన్నీ విశాల ప్రపంచంలోకి తెచ్చి నాగరికతతో నాకు సానపెడ్తుంటే నన్ను నీకు అనుగుణంగా మార్చుకుంటున్నావనే అనుకున్నాను. నాకీ చదువు, సంస్కృతి అలవడకపోతే హాయిగావుండేది. అప్పుడు నిన్ను ప్రేమించే అర్హతలేదని తెలుసుకున్నా నేను యిలా అశాంతి పాలయ్యేదాన్నికాను. సారీ మామయ్య; నేరం.నాదైతే నిన్ను నిందిస్తున్నాను. భూమ్మీద వున్నా, వాజ్‌లోవున్నా గడ్డిపువ్వు విలువ మారదని తెలుసుకోలేని మూర్ఖురాల్ని. ప్రయోజనం లేని విషయాల్ని చర్చించటం అవివేకం. నేను నీకీ లెటలు వ్రాయ తల పెట్టిన వుద్దేశం వేరు కానీ పట్టు తప్పిన మనసు యెక్కడెక్కడకో దీన్ని నడిపించింది. మామయ్య, నిన్ను, అమమ్మనూ కాదనగల శక్తి నాకులేదు ఇన్నాళ్ళూ మీ రాగపూరితమైన నీడనకాలం వెళ్ళబుచ్చిన నాకు స్వతంత్ర జీవనం సాగించాలన్న వాంఛ బలీయంగా నాటుకుంది. గతం ప్రసాదించిన విషాద ఛాయలనుండి సుదూరంగా పారిపోవడానికే నిశ్చయించుకున్నాను. అయినప్పటికీ, నన్నా నీడలు వెంటాడతాయన్న నిజాన్ని కప్పివేయాలని ప్రయత్నించడం వృధా ప్రయాసయేమో కదా !

రోజ్‌లిన్ నాన్నగారు కొండంత మనసుతో నాకీదారి చూపించారు. ప్రస్తుతం ఆ మార్గాన మొదలుపెట్టే నా పయనాన్ని మలుపులులేకుండా ముళ్ళపొదలు అడ్డురాకుండా సాగించాలనే నా ఆరాటం. అందాల కోన సీమలో స్థాపించబడిన అనాథాశ్రమంలో నాకొక వుద్యోగం లభించడం అపురూపంగానే అనిపిస్తోంది. బాహ్యదృష్ట్యా యీ దూరం దాటలేనిది కానప్పటికీ, అంతరాలకు అడ్డుగోడ కాదంటావా? నువ్వేమన్నా, నేనలాగే కావాలని కోరుకుంటున్నాను.

ఇంతకాలం నీ మాటను శిరసావహిస్తూ వచ్చాను. నీవు పెదవి విప్పి చెప్పకపోయినప్పటికీ నీ యిష్టాలనేకం కనుగొని, అనుగుణంగా నడిచాను. ఇప్పుడు నేను నీ యెదలోని యిచ్ఛను కాను కాబట్టి నా

కోరికల ఛాయలనుండి దూరంగా నడచిపో నిచ్చగించాను నన్ను వద్దని ఆదేశించి అడ్డుపడకు. ఆశీర్వదించి పంపించు. నాకు యింకా యెక్కువ గడువు లేదు. మరో పదిరోజులకు అక్కడ వుండాలి. ఈ విషయం అమ్మమ్మకు చెప్పగల శక్తి నాలోలేదు. అన్నిటికీ సమర్థుడవు నువ్వే ఆ పని చెయ్యి.

ప్రభాత.

నా ప్రియమైన మామయ్యా!

వ్రాసిన యీ వుత్తరం నీకందేలా వుంచేటందుకే నీ డైరీ తీశాను. నువ్వు నేర్పిన సంస్కారం అడ్డుచెప్తున్నా ఖాతరు చెయ్యకుండా; నా ప్రసక్తి వుండటం వలనే అయినప్పటికీ, నీ డైరీ చదవటం నేరం నాకేం వ్రాయాలో, యెలా వ్రాయాలోగూడా తోచనిస్థితిలో నిల్చున్నాను నువ్విన్ని దినాలుగా గుండెల్లో మోస్తూ వచ్చిన నిజాన్ని నమ్మడం, నమ్మి జీర్ణించుకోవడం దుస్సాధ్యం.

నాకు అకారణంగా అన్యాయం చేయలేదన్న ఆనందం, సుఖాలను పంచి యివ్వడానికి నన్ను యెంచుకుని, నీ వ్యథలో భాగం తీసుకునే అవకాశం నాకివ్వకుండా తృణీకరించిన విచారాన్ని; ఆ ఆనందం మ్రింగి వెయ్యలేక పోతోంది. విద్య ఆంటీని చేపట్టటం నీ న్యాయ పరిశీలనా దృష్టికి వుదాహరణ మాత్రమే. అందువలన నాకెలాంటి న్యాయం చేకూరలేదు. సహజమైన మాతృత్వాన్ని ప్రతి స్త్రీ కాంక్షిస్తుంది. ఆ కోరిక తీరకపోతే వ్యథ చెందుతుంది. అయితే ఆ బాధ నిన్ను యీ జీవితకాలానికి దూరం చేసికున్న దానికన్నా ప్రబలమైనది కాదు. నీకన్నా పుట్టని పిల్లలమీద నాకెక్కువ మమకారం వుంటుందని నీవెలా భావించావు? నీ భావనకు బలం లేదు. ఈ సృష్టిలో నీకన్నా అమూల్యమైనదీ, ప్రేమించదగినది యింకేమున్నది ? సాహ చర్యంలో యీ జీవితకాలాన్ని ఒక్క క్షణంలో గడిపెయ్యగల నన్ను యే యితర లోటులూ బాధించలేవు. తీర్చలేని లోటును, దారిద్ర్యాన్నీ నువ్వే సృష్టించావు.

అత్యంత విద్యాధికురాలిని చేపట్టిన నీ జీవితం నందనవనంలా వెలుగొందాలి. నా పెదవుల మీద వెలిగే చిరునవ్వు ఆరిపోగూడదు. మనసులోని మంచితనం మారిపోకూడదు. నువ్వు నవ్వుతూ. నవ్విస్తూ బ్రతకాలి. నేను ? నేను... నీ జ్ఞాపకాలతో, నీ తలపులతో, యీ జీవితాన్ని ముగిస్తాను. రాత్రంతా నిద్రలేదు. కళ్ళు మూతలు పడిపోతున్నాయి. నిద్ర ముంచుకొస్తోంది. ఆ నిద్ర శాశ్వత నిద్ర కాకూడదూ! మూతలు పడిన ఆ రెప్పలు మరలా తెరవకుండా వుంటే. అబ్బా... మామయ్యా నేనిక వ్రాయలేను.

ప్రభ.



# మౌనవిపంచి

నిట్టూర్పు నణచుకుంటూ పేపరు మడచి యధా స్థానంలో వుంచాడు. డైరీ వ్రాయగలిగిన మనో నిబ్బరం సడలిపోగా మూసి లోపల పెట్టాడు. కళ్ళు మూసుకుని అలసటగా కుర్చీలో వాలిపోయిన కృష్ణ చైతన్యను చూచి అక్కడకు వచ్చిన విద్య నిశ్శబ్దంగా వెను తిరిగి పోయింది.

అతడు యెప్పుడు, యెవ్వరితో యేమని చెప్పాడో కాని వొకరి తరువాత వొకరు ఆమెను అభినందించి, ప్రశ్నల వర్షం కురిపించారు వారి ప్రశ్నలకు ప్రభాత క్లుప్తంగా చప్పింది.

చివరకు వచ్చిన ప్రభావతమ్మ “ఎందుకు తల్లీ యీ నిర్ణయం తీసికున్నావు ? ఇక్కడ నీకేం తక్కువైంది ?” అంటున్నప్పుడు యెంత ప్రయత్నించినా కన్నీటిని అరికట్టలేకపోయింది.

అన్నీ తెలిసీ తెలియనట్లు అడుగుతున్న అమ్మమ్మకు యేమని చెప్పగలదు ?

“నాకిక్కడ చాలా బాగుందమ్మమ్మా! నా కంటూ యేదో వొక యేర్పాట్లు చేసికోవాలి కదా ! అవకాశం వచ్చినప్పుడు వదులుకోవడం యెందుకు ?,

“నీ పెళ్ళి చేస్తానని మీ అమ్మకు మాటిచ్చాను. అది నిర్వహించ లేకపోతే బ్రతుకున్న నా మనసుకు శాంతి వుండదు. మరణించాక నా ఆత్మకు తృప్తి వుండదు.”

“నువ్వైనా, అమ్మైనా నా సంతోషాన్నే కదా కోరుకునేది. మీరు కోరుకునే ఆ సంతోషం నేను యెంచుకున్న యీ మార్గంలో లభ్య మవుతుందనే నా విశ్వాసం.”

“అంత మాటనకు. నేనేమీ చేయలేని నిస్సహాయురాల్ని. నన్ను శపించకు.” అంటున్న అమ్మమ్మ కన్నీరు తుడిచింది.

“నీ కిష్టమైన వుద్యోగం చేసికోవడాన్ని ఖండించే అధికారం నాకు లేదు. నా పిల్లలకే చెప్పలేకపోయాను. నీకెలా చెప్పగలను ! నీకు నచ్చిన వ్యక్తి తటస్థపడితే నాకు సంతోషమే. నాకు మాత్రం నీ పెళ్ళి చేసే అవకాశాన్ని, చూచే అదృష్టాన్ని కలిగించు.”

ప్రభాత మౌనం ఆమెను మరింత కలవరపెట్టగా వ్యధా భరిత హృదయంతో కొడుకు దగ్గరకు వెళ్ళి “ప్రభాత మళ్ళీ యిక రాదుటా?” అంది.

“నాకెలా తెలుస్తుందమ్మా?”

“నువ్వా అలాగంటే యెలారా ? అది యేడుస్తూ యీ యింట అడుగు పెట్టింది. యేడుస్తూనే వెళ్ళాలా ?”

“నేనేం చెయ్యగలనమ్మా ? వాళ్ళమ్మ యిచ్చిన బ్యాంకు పాస్ బుక్ యిచ్చేశావా?”

“ఐతే పంపాల్సిందేనట్రా?”

శుష్క హాసం చేస్తూ “ప్రభాత వెళ్ళడానికే నిశ్చయించు కున్నాక మనం పంపక చేయగలిగిందేమీ లేదు” అన్నాడు.

ఆమె వెళ్ళాలి అన్నాక, అతడు వెళ్ళడాన్నే అంగీకరించాక అడ్డంకే ముంది? ఆమెతో యెవ్వరు వెళ్ళాలన్న ప్రశ్న వుదయించినప్పుడు బదులు తేలిగ్గా లభించలేదు. నందకిశోర్ పెళ్ళి ప్రసక్తికై అతని కాబోయే అత్త, మామగార్లు రాబోతున్నారు, అందువలన ప్రభావతమ్మ కానీ, రామస్వామిగారు కానీ వెళ్ళను వీల్లేదు. అప్పటికే లీవులు అన్నీ వుప యోగించుకోవడం వలన, పరీక్షలు సమీపిస్తున్నందు వలన కృష్ణచైతన్యకూ, విద్యకు కుదరడంలేదు.

“రాధకు ఫోన్ చేసి చెప్పరా.” అంది ప్రభావతమ్మ.

తర్జన భర్జనల్ని తీరిగ్గా విన్న ప్రభాత “నేనొక్క దాన్నే వెళ్ళ గలను” అంది.

“కొత్త చోటికి వొక్కదాన్నే యెలా పంపుతాను” అంది ప్రభాత అమ్మమ్మ.

“ఒక్కదాన్నే బ్రతకడానికి కదమ్మమ్మా వెళ్తూంది, ఆదిలోనే వెనుకంజ వేయను.”

ఆమె కంఠంలో ధ్వనించిన దృఢత్వాన్ని గుర్తించిన యెవ్వరూ యేమీ అనలేకపోయారు.

“ఆల్‌రైట్...నీయిష్టం” కృష్ణచైతన్య డిక్లేర్ చేయడంతో ప్రభావతమ్మ మాట్లాడలేదు.

ఆ రోజే అతడు గోదావరి ఎక్స్‌ప్రెస్‌కు రిజర్వుచేసిన టికెట్‌తెచ్చి ఆమె చేతిలో పెట్టాడు. “ప్రయాణానికి యేర్పాట్లుచేసికో.”

“నేను సిద్ధంగా వున్నాను.”

“ఎప్పుడు వెళ్ళిపోవాలా అని చూస్తున్నావా.”

“......”

“నేను రాక్షసుడిలా కనుపిస్తున్నానా?”

“దేముడిదగ్గరే అయినా స్థానం లేనప్పుడెందుకు?”

ఎన్ని మాటలు నేర్చింది! నిజానికి తనుకదూ ఆమెనిలా తయారు చేసింది ! ఆమె తన సాధన.

నిట్టూర్చాడు.

ప్రభాతకు వీడ్కోలు యివ్వను అందరూ బాధపడ్డారు. రాధ తన యింటినుండి భర్తతోగూడా వచ్చింది. ప్రభాత సెలవు పుచ్చుకుంటున్న విధానం అందరి హృదయాలనూ కలచివేసింది.

“కృష్ణ యిలా చేశాడేమిటోయ్” అన్నాడు శరత్ రాధతో.

వెళ్ళబోతున్న ఆమెను సమీపించి మనసారా కౌగలించుకుని “మీ అమ్మకేమీ చేయలేకపోయానన్న వ్యధ నన్నింకా కాల్చివేస్తూనే వుంటే, అది చాలదేమోనని నువ్విలా శిక్షిస్తున్నావు” అంది ప్రభావతమ్మ కన్నీళ్ళ మధ్య.

“అమ్మమ్మ! అమ్మ తరువాత అమ్మలా ఆదరించావు. నా అసలు అమ్మమ్మ యెలా వుంటుందో నాకు తెలియదు. అమ్మకు నీలో అమ్మను చూపించి నాకు అమ్మవైనావు. నీదగ్గర లభించిన యీ ఆదరణ, ఆడ పిల్లకు కావాల్సిన రక్షణ నీకు దూరమయ్యాక నాకు లభించవని తెలిసి నప్పటికీ యీ నిర్ణయం తీసికోక తప్పలేదు. నిన్ను కష్టపెడుతున్నాను నన్ను ప్రేమిస్తున్నందుకే మన్నించగలవు.”

ప్రభాతను స్టేషనువద్ద దింపను కృష్ణచైతన్య మాత్రమే బయలుదేరాడు.

“మీరూ రండి ఆంటీ” విద్యను వేడుకుంది.

“నాకు తలనొప్పిగా వుందమ్మా. మీ మామయ్యతో వెళ్ళు” అంది.

రాము యేడుస్తూ వచ్చి ప్రభాత సామాను డిక్కీలో పెట్టాడు ఆఖరుసారి అందరివద్దా వీడ్కోలు తీసికుంది.

మౌనంలోని బాధను మననం చేసికుంటూ వుండగానే స్టేషనుకు చేరారు. కారు దిగి సూటుకేసు, బెడ్డింగ్ పుచ్చుకున్నాడు.

“నాకొకటి యివ్వు.”

“ఇకనుండి నువ్వే మొయ్యాలి.”

“నా బాధ్యతను గూడా మామయ్యా”

“ఆ బరువు నీకు కష్టంగా తోచినప్పుడు మామయ్యను గుర్తు చేసికుంటావా?”

“నీ ఆశీస్సుల బలంకాక నాకింకేముంది?”

సామాను ప్లాట్‌ఫారంమీదపెట్టి “నీ వస్తువొకటి కార్లోనేవుంది తెస్తాను” అని వెళ్ళిన అతడు చేతిలో పెద్ద పాకెట్‌తో వచ్చాడు.

ఆరోజు ఆర్టు యెగ్జిబిషన్‌లో తీసికున్న ఆర్టును ఆమె వెంటనే గుర్తించింది.

“నాకెందుకు మామయ్యా !”

# మీ పాపాయికి
# సిరిలాక్ ప్రేమను అందివ్వండి!

ఇప్పుడు కొత్త ప్యాకెట్లో

సుమారు 4వ నెల నుంచి, మీ పాపాయికి పాలతోపాటు, ఘనపదార్థాలు కూడా అవసరమవుతాయి. బాబుకు సిరిలాక్ ప్రేమను అందించడానికి తగిన సమయం ఇదే.

**పోషకాహారపు లాభం :** ప్రతి సిరిలాక్ మోతాదు, మీ పాపాయికి కావలసిన పోషకాహారాలు—మాంసకృత్తులు-కార్బోహైడ్రేట్లు-కొవ్వు-విటమిన్లు-ఖనిజాలను సమకూరుస్తుంది. మీ పాపాయి ప్రత్యేక అవసరాలకు తగినట్టు సమపాళ్లలో తయారయింది.

**త్వరితగతి లాభం :** మీ పాపాయికి ఎప్పుడు కావాలంటే, అప్పుడు, సెకెన్లలో సిద్ధమవుతుంది. దీనిలో పాలు, పంచదార ఉండనే ఉన్నాయి. ఇక, మీరు, ముందు మరిగించి వుంచుకున్న నీటిలో దీన్ని కలపాలి. అంతే!

**రుచి లాభం :** మొదటి ఘన ఆహారం, కొత్త గమ్మత్తు రుచిని అనుభూతిని ఇస్తుంది. పాపాయికు దీని రుచి ఎంతో నచ్చుతుంది. ఇది, శుభారంభం కూడా. మీ పాపాయికి సమపాళ్లలో పోషకాహారాన్ని అందచేసేందుకూ, తయారీలో శుభ్రతను పాటించేందుకూ, డబ్బా మీది సూచనలను అనుసరించండి.

**పెరుగుదల పట్టిక ఉచితం !**
మీ పాపాయికి తన స్వంత పెరుగుదల పుస్తకం కోసం రాయండి. సిరిలాక్, పోస్ట్‌బాక్స్-3 క్రొత్త ఢిల్లీ-110008.







ESL/C/3799.TEL

# ప్రశ్నలు అడగనంత కాలం

నాలుగు గోడల మధ్య అజ్ఞానంలో
లేదా బహిరంగంగా ఇక్కడ
తింటూ – కంటూ – జీవించడం
అసలే నేరం కాదు––––
మీరు ఇబ్బంది కలిగించే ప్రశ్నలు అడగనంత కాలం
ఆరాటం–ఆర్తితో
అంతరాత్మను వినసంత కాలం!

కావాలని లేదా పొరబాటున
ఎక్కువగా తెలుసుకున్నారో
చైతన్యం మీరి – వ్యవస్థ"లోకి
చొచ్చుక పోయారో
ఈ "ప్రజాస్వామ్యం" పేర
మీకు బతికే హక్కు అసలే లేదు!!

–నిఖిలేశ్వర్

# మౌనవిపంచి

"నీ వస్తువు. నీ కిస్తున్నాను."

"........."

"ప్రభా! ఈ పెయింటింగ్ నీకోసం కొన్నప్పటి నా ఆంతర్యమేమిటో నీకు నేను చెప్పకపోయినా అర్ధమయ్యింది. అలాగే మర్చిపోకుండా యిప్పుడు నీకిస్తున్న వుద్దేశాన్నిగూడా గ్రహించుకుని మసులుకో."

"మామయ్యా!"

"అవును ప్రభా. ఈ బొమ్మలోని భావనే నన్ను నీనుండి దూరం చేసింది. అందుకోసమే... నువ్వలా సృష్టిలోని మాధుర్యాన్ని చవిచూడాలన్న కోరికతోనే నిన్న నేను త్యాగం చేసికున్నాను. నన్నొక మూర్ఖుడిగా నిలబెట్టకు. నా వేదనను రెట్టింపు చెయ్యకు."

నీళ్ళు నిండిన కళ్ళతో అతడ్ని చూచింది.

తన త్యాగం వ్యర్థమౌతుందేమోనని అతడు కుమిలిపోతుంటే ఆమె అనునయించలేకపోయింది.

ఎంత గొప్పవాడు! ప్రపంచం కన్నా విశాలమైన హృదయం కలవాడు!

ప్రేమిస్తూ, కాంక్షిస్తూ, నిస్వార్థంగా వదులుకోగలిగిన అతడి పట్ల అనురాగం అధికమౌతుందేతప్ప యెలా తరిగి పోతుంది?

ఆమె మౌనాన్ని శరణువేడి, కన్నీటిని ప్రత్యక్షం కావద్దని ప్రార్థిస్తోంది.

"ప్రభా కొన్ని నిమిషాల వ్యవధి మాత్రమే వుంది. మాట్లాడు."

"ఆ వ్యవధి వ్యర్థం. మాటలు నిరుపయోగం."

"అవును. వీడ్కోలు సందర్భంగా మొదటిసారిగా మనసు విప్పి మాట్లాడు కోవాలనుకోవడం నిష్ప్రయోజనమే అయినప్పటికీ...కొంత శాంతిని ప్రసాదించలేవా?"

"............"

"నీకే కష్టం కలిగినా, అపుసరం యేర్పడినా..."

అతని మాటలను మధ్యలోనే త్రుంచివేస్తూ "వద్దు మామయ్య. మనం యిలాగే విడి పోదాం" అంది.

"ఒ.కె. అన్నీ నీ యిష్ట ప్రకారమే జరుగుతాయి."

"వచ్చిన దగ్గర్నుండీ నువ్వు నా యిష్టాల్ని గుర్తించి మన్నిస్తూనే వచ్చావు. నేనెలా మర్చిపోగలను?"

"మర్చిపోకు ... జ్ఞాపకం వుంచుకో. అలాగే నీ జీవితం పట్ల నా అభిమతాన్ని గూడా గుర్తుంచుకో."

"............"

"ఎన్నిసార్లు నొక్కి చెప్పినా నువ్వు మౌనం వహిస్తున్నావు."

"మన్నించు మామయ్య, మాటల్లో వెలువడే నా నిర్ణయం నీకు కష్టంగా వుంటుంది."

గోదావరి యెక్స్‌ప్రెస్ ప్లాట్‌ఫాం మీదకు వస్తున్న యెనౌన్సు మెంటు వినబడిన వెనువెంటనే బండి వచ్చేసింది. ప్రయాణీకుల హడావుడితో గందరగోళంగా వుంది.

కృష్ణ చైతన్య సామాను పుచ్చుకుని బయలుదేరగా, ప్రభాత పెయింటింగ్ చేత బుచ్చుకునే అతన్ననుసరించింది.

ఆమెకు యిష్టం కలిగేలా సీటు కిటికీ ప్రక్కనే వుంది. అతడు దిగి వెళ్ళి పండ్లు, పుస్తకాలు తెచ్చిచ్చాడు. బండి బయలుదేరబోయే సమయానికి అయిష్టంగా అతికష్టంగా, క్రిందికి దిగివచ్చాడు.

గార్డు పచ్చజెండా వూపాడు.

రైలు ప్రయాణానికి అది నాంది.

ఈ ప్రయాణం ఆమె జీవిత ప్రయాణానికి నాంది.

"మామయ్య" కిటికీలో నుండి వూపుతున్న ఆమె చేతిని గట్టిగా పట్టుకుని మనసులో అణచివేయబడిన మమతలువెలికిరాగా, తొలిసారిగాతన పెదవులతో ఆ చేతిని మృదువుగా స్పృశించి వదిలేశాడు.

రైలువేగాన్ని పుంజుకుంటూ అతని గుండెలమీదుగా వెళ్ళి పోటంతో వెళ్ళిపోతున్న ఆమెను ఆపలేని అశక్తుడై అతడు నిల్చున్నాడు. ఆమెను అతడ్నుంచీ దూరంచేస్తూ, విధిలా కర్కశంగా ధ్వనిచేస్తూ కదలిపోతున్న రైల్లో వెళ్ళిపోతూన్న ప్రభాత క్రమంగా కనుమరుగౌతూ కన్నీళ్ళమధ్య మసకమసగ్గా కనుపించిందతనికి.

**(అయిపోయింది)**



# ఆంధ్రసచిత్రవారపత్రిక

# ఛాయా చిత్రాల పోటీ!

(ఫొటోగ్రఫీ పోటీ)

## మొత్తం బహుమతులు రు. 3000

**మొదటి బహుమతి రు. 1000**

**రెండవ బహుమతి రు. 750**

**మూడవ బహుమతి రు. 500**

**ఒక్కొక్కటీ రు. 250 చొప్పున మూడు ప్రత్యేక బహుమతులు**

**ముగింపు తేది : 15-6-85**

### నిబంధనలు

1. పోటీకి నలుపు-తెలుపు చిత్రాలనే పంపాలి. రంగుల చిత్రాలు పంపరాదు. ఛాయా చిత్రాలు తెలుగు సంస్కృతిని ప్రతిబింబింప చేసేవిగా ఉంటే మంచిది. ప్రకృతి దృశ్యాలని కూడా పంపవచ్చు.
2. ఛాయా చిత్రాల సైజు 8''×6''కి మించకూడదు. పోటీకి ఒక్కొక్కరు 3 చిత్రాలకన్నా ఎక్కువ పంపరాదు.
3. పోటీకి పంపే ప్రతి ఛాయా చిత్రం వెనుక వైపు అది తాము స్వయంగా తీసినదేనని హామీ రాస్తూ దానికి సంబంధించిన సాంకేతిక వివరాలని పేర్కొనడం అవసరం.
4. పోటీలో బహుమతి పొందని ఛాయా చిత్రాలని తిప్పి పంపగోరేవారు వాటితో పాటు తగినన్ని తపాలా బిళ్లలు అతికించిన స్వంత చిరునామా కల కవరు జతపరిచి పంపాలి. లేకపోతే వాటిని తిప్పి పంపడం సాధ్యం కాదు.
5. బహుమతి పొందని ఛాయా చిత్రాలని తిప్పిపంపే విషయంలో తగిన జాగ్రత్తలు తీసుకోడం జరుగుతుంది. కానీ వాటి విషయంలో ఎలాంటి బాధ్యతనీ స్వీకరించటానికి వీలుకాదు.
6. పోటీకి పంపే ఛాయా చిత్రాలు జూన్ 15వ తేదీకి మా కార్యాలయానికి అందాలి. ఆ తర్వాత వచ్చే వాటిని స్వీకరించడం జరగదు.
7. పోటీకి పంపే ఛాయా చిత్రాలని సంపాదకుడు, ఆంధ్రసచిత్ర వారపత్రిక, గాంధీనగరం, విజయవాడ-520003 అన్న చిరునామాకి పంపాలి. వ్యక్తుల పేర పంపరాదు. కవరు పై భాగంలో ''ఛాయా చిత్రాల పోటీకి'' అని స్పష్టంగా రాయాలి.
8. పోటీలో తుది నిర్ణయం సంపాదకునిదే. పోటీలో పాల్గొనే వారందరూ దానికి బద్ధులై ఉండాలి.

— సంపాదకుడు



మాంచి వయసులో వున్న కుర్రాడికి యింకా మాంచి కండిషన్‌లో వున్న స్కూటర్ని నడపడంలో వున్న ఆనందం యింక దేనిలోనూ దొరకదేమో అనిపిస్తూంటుంది ఒక్కోసారి నాకు. ఫుల్‌స్పీడ్‌లో, హారన్ మీద వేలు నొక్కిపెట్టి వుంచి, అందర్నీ ఓవర్‌టేక్ చేసుకు పోతూంటే— ఓహ్— గొప్ప థ్రిల్ !!

అయిదున్నరకి బ్యాంక్ వదుల్తానే, జానపదహీరో గుర్రం ఎక్కినట్లు స్కూటర్ మీదకు ఎగిరి కూర్చుని, కిక్ కొడుతూనే క్లచ్ వదిలి ఏక్సిలేటర్ రైజ్ చేసి, బండిని ముందుకి దూకించాను క్షణాల్లో 'అశోకా థియేటర్ చేరి, రెండు టిక్కెట్లు తీసుకుని, రూంకి పోయి ముస్తాబై 'ఫియాన్సీ'తో సినిమాకి వెళ్లాలనేది నా తొందర.

గోపాలస్వామి గుడి, ఎం.జి.ఎం. మెరుపు వేగంతో దాటేసాను. కె.ఎం.సి. చేరుతూండగా... అదిగో... అక్కడ పడిందయ్యా బ్రేకు...నా స్కూటరు స్పీడుకి, నాలోని ఉత్సాహానికీ .

ఒక 'తాను' కాకీ ప్యాంటులో రెండు తాన్ల తెల్లచొక్కా కుక్కి, నాలుగంగుళాల వెడల్పు బెల్టుతో, వాటిని బిగించిన లావుపాటి నల్ల మీసాల పోలీసు— నా స్కూటర్‌కి అడ్డువస్తూ, చెయ్యి వూపుతున్నాడు 'ఆప'మన్నట్లుగా.

గొప్ప నిస్సత్తువ ఆవహించేసింది నన్ను— అంతకుమించి విపరీతమయిన కోపం కమ్మేసింది కూడా. బక్కపలచటి వాడో, ఓ మోస్తరు పెర్సనాలిటీయో అయితే నిస్సంకోచంగా గుద్దిం చేసి, ముందుకు దూసుకుపోయే వాణ్ణే—ఎమయితే అవుతుందని. కాని... కొండంత ఆకారం — చూస్తూ చూస్తూ... హమ్మో!! నా ముద్దుల స్కూటరూ, నేనూ... నామరూపాలు లేకుండా పిండి అయిపోమూ ?!

కానీ, బండిలైసెన్సు గాని, డ్రైవింగు లైసెన్సుగాని, ఏవీ దగ్గర లేవు. అందులో యితగాడు పరమ కర్కోటకుడనీ, జేబులు ఖాళీ చేసిగాని వదలడని విన్నాను చాలామంది చెబితే. ఏందారి? ... ఆలోచించేంత టైమూ లేదు... ఇంకొంత ముందే గమనించి వుంటే...లెఫ్ట్‌టర్న్ తీసుకుని వేరే దారి పట్టించే వాడిని... ఖర్మరా నాయనా... !!

'కీచు'మని బ్రేకు నొక్కుతూ, అతగాడి ముందు ఆపాను బండిని— దడదడలాడే గుండెతో, నేరస్థుడిలా చూస్తూ.

''చౌరస్తా దాకా లిఫ్టు గావాలె సార్''

ఉలిక్కిపడ్డాను! నా చెవుల్ని నేనే నమ్మలేక పోయాను !

''ఏంటండీ...?'' అన్నాను— మళ్ళీ ఆ అమృతపు పలుకుల్ని రిపీట్ చెయ్యమన్నట్లుగా—

''అన్మగొండ చౌరస్తాదాకా...'' తర్వాత అక్షరాలు అతని మృదు మధురమయిన గరగర గొంతుతో ఉచ్ఛరించాడు గాని, ఆనందంతో ఉబ్బితబ్బిబ్బవుతూన్న నాకు వినిపించలేదు— వినాల్సిన అవసరమూ లేదు.

''వెల్‌కమ్— రండ్రండ''న్నాను ఉత్సాహంగా.

చిరునవ్వు చిందించి, తన ఏభయికిలోల కుడి కాలుని నాలుగు కిలోల బూటుతో సహా ఎత్తి, స్టెప్నీ మీదుగా సర్కస్ వాళ్ల పెర్సిలైటులా యాంటీ క్లాక్ వైజ్‌గా తిప్పి, నెమ్మదిగా స్కూటర్‌కి రెండో వైపు నేలకాన్చి, 'హూం' అంటూ సీటుమీద స్టెప్నికి నాకు మధ్య కూరుకు కూలబడేసరికి, నేను ఆరంగుళాలు ముందుకు నెట్టబడటం, ముందు చక్రం మొండికెత్తిన గుర్రంలా పైకి లేవడం ఒక్కసారే జరిగాయి. గాభరా పడుతూనే ఎంతో సమయస్ఫూర్తిగా రెండు కాళ్లూ బలంగా నేలకాన్చి, శక్తంతా చేతుల్లోకి తెచ్చుకుని, గుండెలనిండా ఊపిరిపీల్చి హ్యాండిల్ క్రిందికి అదిమి, బండిని కంట్రోల్ లోకి తెచ్చుకుని, 'ఒక్క రెండు కిలోమీటర్లు భారం మోసి, నా పరువు నిలబెట్టవే బంగారు తల్లీ' అని బ్రతిమాలి, 'రేపు నీకు అభ్యంగన స్నానం చేయించి, ఆయిల్ పెట్టించి, పాలిష్ కొట్టించి, ముస్తాబు చేస్తాగా' అని ఆశపెట్టి, గేర్‌లో వేసి, క్లచ్ వదిలాను... ఉహూఁ... కదల్దే !! ఏమయితే అయ్యిందని థ్రాటిల్ ఫుల్‌గా తిప్పి, ఒక్కసారిగా క్లచ్ వదిలిపెట్టాను... అప్పుడు కదిలింది గునుస్తూ. అంత రైజ్ చేస్తే వంద కిలోమీటర్ల స్పీడులో వెళ్లాల్సిన బండి అయిదు కిలోమీటర్ల స్పీడులో ఒణుకుతూ నడుస్తోంది. నా సీటులో కూడా మూడొంతులు అతగాడే ఆక్రమించేసుకోవడంతో మిగిలిన కొద్ది స్థలంలోనూ కూర్చోవడమే ఇబ్బందిగా వుంది. పైగా అతగాడి బెల్టు నా వెన్నుపూసకి కుదుపు వున్నప్పుడల్లా గుచ్చుకుని, యమబాధపెడ్తోంది—

ఎలాగో సర్దుకుని, జాగర్తగా నడుపుతున్నాను, కష్టపడుతూనే.

అయితే— మానసికంగా చాలా ఆనందంగా వుంది నాకు. చెకింగ్ కోసం ఆపాడని భయపడుతూన్న నన్నే లిఫ్టు కోసం రిక్వెస్టు చేసాడంటే ఆనందంకాదూ మరి ? ఇహ నేను ఇతగాడి లైన్లో వున్నంతకాలం లైసెన్స్‌ల గురించి భయ పడనక్కరలేదు. హాయిగా, ఝూంమ్మని దూసుకు పోతూండొచ్చు. నా అదృష్టం కాకపోతే నా స్కూటరే ఇతన్ని ఆకర్షించాలా ?

బొత్తిగా కండోలెన్స్ మీటింగ్‌కి వెళ్తొన్నట్లు మౌనంగా వుండటం యిష్టంలేక, "మీ పేరేవిటండీ?" అని పలకరించాను.

"ఈరాసావి" అన్నాడు.

నా పేరూ అడుగుతాడనుకున్నాను. అడగ లేదు. నేనే చెప్పేద్దామనుకుంటూండగా, "కొలు వేడసార్ తవఁది?" అన్నాడు.

'బుద్ధి పోనిచ్చుకున్నావు కాదుకదా— పేరడక్కుండా వుద్యోగం అడుగుతున్నావా' అనుకుని చెప్పాను.

"బేంకులోవా సార్" అంటూ కాద్ది ఆనందాన్ని ప్రకటించి, ఎదో ఆలోచనలోపడ్డాడు.

అవునన్నట్లు తలూపి, "ఎప్పుడన్నా మా బ్యాంకుకి పని పడి వస్తే నన్ను కలవండి" అన్నాను.

"గట్లనే సర్ గట్లనే..." అంటూండగా. అతగాడి దృష్టిలో ఎవరో పడ్డట్లున్నారు, "జర అవ్రని... జర అవ్రని బాజూల..." అన్నాడు ఎడమ ప్రక్కకి చెయ్యి చాపి. ఆ దిక్కు వంగుతూ. ఒక్కసారిగా అతగాడలా వంగేసరికి, అటు వైపు ఒరిగిపోతున్న బండిని కాలు నేల కాన్చి కంట్రోల్ చేసుకుంటూ ఆపాను.

స్కూటర్ దిగకుండానే రోడ్డువారగా మూలకి వున్న పాన్‌షాప్ వైపు చూస్తూ, "సార్" అని పిలుస్తూ, చప్పట్లు కొట్టాడు వీరాస్వామి.

అటు సారించిన నా చూపులో ఒక ట్రాఫిక్ ఇన్‌స్పెక్టర్ పడేసరికి మళ్ళీ భయం మొద లయ్యింది— 'ఇదేవిఁట్రా దేవుడా, కొంపమునగ బోతుంది కాబోసు' అని.

వీరాస్వామిని చూస్తూనే ఇన్‌స్పెక్టర్ ఉత్సాహంగా వచ్చాడు.

"సార్— గీసార్‌కి బేంకిల కొలువంట. లోన్ గావలెనన్నరు గంద గప్పుడు?" అన్నాడు వీరా స్వామి. అవునన్నట్లుగా తల వూపి, చిరునవ్వుతో నాతో చెయ్యికలిపి, తన పేరు, కావల్సిన లోన్ విషయాలు రెండు నిమిషాలు మాట్లాడాడు ఇన్‌స్పెక్టర్. వీలునిబట్టి బ్యాంకుకి రమ్మన్నాను ఆనందంగా, రీవిగా.

మళ్ళీ బండి కదిలింది. వీరాస్వామి మీద నా మనస్సు కృతజ్ఞతతో నిండిపోయింది— ఇన్‌స్పెక్టర్‌ని కూడా పరిచయం చేసినందుకు.

"ఎన్నడన్నా పోలీసులతో గిట్ల ప్రాబ్లమొస్తే నా పేరుగాని, మా సార్ పేరుగాని జెప్ప్రని— ఏంగాదు" అన్నాడు వీరాస్వామి నా చెవిలో.

'ఆనందంలో ఉక్కిరి బిక్కిరిచేసి ఒక్క సారిగా చంపెయ్యకయ్యా బాబూ' అనుకున్నాను లోలోనే.

"థేంక్స్ సార్" అన్నాడు చౌరస్తాలో దిగిపోయి. సెల్యూట్ కొట్టి.

"వెల్‌కమ్" అంటూ చేటంత అయిన నా మొహాన్ని అతను బాగా గుర్తుపెట్టుకునేలా అతని వైపు తిరిగి, చిరునవ్వు చిందించి, ముందుకు కదిలించాను బండిని. మెరుపువేగంతో సాగి, హాలు దగ్గర ఆగింది బండి.

రెండు టిక్కెట్లు కాదు, మొత్తం టిక్కెట్లన్నీ కొనేసి, అందరికీ పంచిపెట్టేంచా లన్నంత ఆనందంగా వుంది.

'ఇంత కొద్దిదూరం లిఫ్ట్‌కే తన పేరుని అవసరానికి ఉపయోగించుకోమంటున్న వీరాస్వామి నిజంగా కృతజ్ఞత అంటే ఏమిటో తెలుసున్న వాడు' అనుకుంటూ, టిక్కెట్ల డబ్బుకోసం పర్సు తీద్దామని, బ్యాక్ పాకెట్‌లో చెయ్యి పెట్టి, ...

— గతుక్కుమన్నాను !

గబగబా అన్ని జేబులూ వెతికాను...

— అదిరిపడ్డాను !!

... లేదు... పర్సు లేదు...

...పోయింది... అందులో వంద రూపా యలదాకా వున్నాయి... పోయాయి... కాదు... కొట్టేసాడు... వీరాస్వామిగాడు...

.. 'అమ్మ దొంగ గాడిద కొ... !!!' □





# సినిమా



"పులి"లో సంయుక్త

## "అగ్గిపిడుగు"లో ఘాగ్వానం

భూపతి (ప్రబాకరరెడ్డి) మందిరం తన ఎదుట ఉన్న విజయ్ (రవి) అర్జున్ (గిరిబాబు) లను ఇంత మారుమూల ప్రాంతానికి మీరు రావడానికి కారణం? ప్రశ్నించాడు భూపతి

మేం ఒకడ్ని వెతుక్కుంటూ వచ్చాం భూపతి గారూ! అని అర్జున్ 'అతని పేరు మార్తాండ్' అని విజయ్ సమాధానాలిచ్చారు

ఖంగు తిన్నాడు భూపతి ఆఁ! మార్తాండా!

అవును ఓ ముగ్గురు కిరాతకులు మా చిన్న తనంలో మా తల్లిదండ్రుల్ని దారుణంగా చంపి మమ్మల్ని అనాదల్ని చేశారు వాళ్ళలో భగవాన్ సాకెల్ని అంతం చేశాం ఇప్పుడు మిగిలిన ఆ మార్తాండ్ కోసమే ఇంత దూరం వచ్చాం అన్నాడు అర్జున్

మేం చెట్టుకొకరు పుట్టకొకరు చెల్లాచెదరై పోవడానికి కారణమైన ఆ కసాయివాడి మీద ప్రతీకారం తీర్చుకోడానికి వచ్చాం అన్నాడు విజయ్

'ఎప్పుడో చిన్నప్పుడు మీకు ద్రోహం చేసిన వాడ్ని ఇప్పుడెలా గుర్తు పట్టగలరు? అడిగాడు భూపతి

ఆ నీచుడ్ని గుర్తు పట్టే వ్యక్తి మా దగ్గరున్నాడు బలరాం! అన్నాడు అర్జున్

బలరాం పేరు వినగానే చకితుడైనా భూపతి పైకి తాపిగా సరే నన్ను కాపాడి నాకు మేలు చేసిన మీకు నేనేదో ఒక ఉపకారం చేస్తాను రేపు సాయంత్రం – నిన్న నన్ను ఎక్కడైతే కాపాడారో – అక్కడికి రండి అక్కడే మార్తాండ్‌ని మీ కప్పగిస్తాను అన్నాడు

ఆఁ ! ఆ మార్తాండ్ ఎక్కడున్నాడో మీకు తెలుసా? అయితే చెప్పండి ఇప్పుడే వెళ్ళి వాడ్ని ఆవేశం ఆపుకోలేకపోయాడు అర్జున్

అది అంత సులభమైన పని కాదు నేనే స్వయంగా మార్తాండ్‌ని మీ కప్పగిస్తాను మీ ఇద్దరికీ ఉపకారం చేసే అవకాశం నాకివ్వండి. నా మాటా, మీ ధ్యేయం రెండూ నెరవేరతాయి." అన్నాడు భూపతి.

అది సబబేననిపించింది అర్జున్, విజయ్‌లకు.

మంతెన దేవేంద్రరాజు నిర్మించే రాశి ఆర్ట్ మూవీస్ "అగ్గిపిడుగు" చిత్రానికి గిరిధర్ దర్శకుడు.

"ముచ్చటగా ముగ్గురు"లో



# విశేషాలు

-జి. వి. జి.

## కె ఎస్. రెడ్డి దర్శకత్వంలో "కసాయి గుండెలు"

సెంటిమెంట్‌తో పాటు యాక్షన్ మిళితమైన చిత్రం క్రాంతిమోహన్ అనే హీరోను పరిచయం చేస్తున్నాం అన్నారు కె ఎస్ రెడ్డి ఈయన

చంద్రమోహన్ తులసి

"మాయదారి మరిది"లో మహాలక్ష్మి

స్క్రీన్‌ప్లే దర్శకత్వ బాధ్యతలు వహించే శ్రీ నరేంద్రా ఫిలిమ్స్ కసాయి గుండెలు చిత్రం హైదరాబాద్‌లో ఏప్రిల్ 5 నుంచి మే 10 వరకు ఒకే షెడ్యూల్లో పూర్తవుతుంది బాలాజీ పూర్ణిమ అరుణ జె వి సోమయాజులు సుదర్శన్ నర్రా వెంకటేశ్వరరావు వెంకట్ స్మిత అనూరాధ పుష్పకుమారి పాత్ర ధారులు కాశీ విశ్వనాథ్ మాటలు సత్యం స్వరకల్పనలో వేటూరి గోపి రోహిణీకుమార్ గీతాలు రాశారు దేవీప్రసాద్ ఛాయ కృష్ణమూర్తి శిల్పం టి ఎ కుమార్ ప్రొడక్షన్‌తో వనపర్తి నరేంద్రబాబు నిర్మాత ఈయన లోగడ రాధమ్మ మొగుడు చిత్రాన్ని నిర్మించా రు

## "ఈ సమాజం మాకొద్దు"

దోపిడి శక్తులను సమర్థిస్తూ శ్రామికుల అభ్యుదయానికి ఆటంకంగా పరిణమించే ఈ సమాజం మనకొద్దు - అంటూ ఎలాంటి సమాజం కావాలో తెలియజేసే చిత్రం - చిరకాలం జరిగిన మోసం బలవంతుల దౌర్జన్యాలూ ధనవంతుల పన్నాగాలూ - ఇంకానా? ఇక చెల్లవు అన్నారు మహాకవి శ్రీశ్రీ ఆ స్ఫూర్తితో ఈ సందేశాత్మక చిత్రాన్ని గతంలో పునాదిరాళ్ళు వంటి చక్కని చిత్రాన్ని డైరెక్టు చేసిన రాజకుమార్ ఎంతో నైపుణ్యంతో రూపొందించారు ఫిబ్రవరి 15 నుంచి మార్చి 15 వరకు రాజమండ్రి పరిసరాలలో నిర్విరామంగా షూటింగ్ ముగించాం అన్నారు జి ఎస్ ఆర్ పరిమళరావు ఈయన నిర్మించిన పై చిత్రంలో షావుకారు జానకి వనితశ్రీ, మనోచిత్ర గోకిన రామారావు త్యాగరాజు ఆనందమోహన్ కాకరాల సంజీవి రాంప్రసాద్‌తో పాటు మరికొందరు నవ కళాకారులు కూడా పాల్గొన్నారు మోదుకూరి జాన్సన్ రచన రమేష్‌నాయుడు సంగీతం విజయ-కుమార్ ఛాయ సుద్దపల్లి వెంకట్రావు నిర్వహణ సి హెచ్ వెంకటేశ్వరరావు కూర్పుతో డాక్టర్ విమలాదేవి (దుబాయ్) సమర్పించే ఈ చిత్రం మే విడుదల

## దేవర్ ఫిలిమ్స్ 3–డి చిత్రం "మాతృభూమి"

"నిజాయితీగల ఒక సైనికాధికారి జీవితాన్ని తెలియజేసే దేశభక్తి ప్రపూరితమైన ఇతివృత్తం త్రిడి ప్రక్రియతో ఎన్ని థ్రిల్స్ కలిగించవచ్చో అన్నీ కలిగించడానికి ఎంతో కృషి చేశాం ప్రత్యేకించి రెండు హెలికాప్టర్ చేసింగ్‌లు గుండెలు జలదరించేలా చిత్రీకరించడంలో కృతకృత్యులయ్యాం వినోదం కలిగించే అంశాలు కూడా చాలా ఉన్నాయి."

అన్నారు డైరెక్టర్ ఆర్ త్యాగరాజన్ పాత్రికేయులతో ముచ్చటిస్తూ, "త్రీ-డి చిత్రాలను తీయాలనే తలంపు మాకెంత కాలంగానో ఉంది అధిక వ్యయ ప్రయాసలతో కూడుకున్న పని ఆర్టిస్టులకు, టెక్నీషియన్‌లకు ఎంతో ఓపిక అవసరం అనువైన కథ కూడా ఉండాలి అన్నీ సమకూరాయి గనుకే ముందుకు సాగాం ఇకపోతే, మా దేవర్ ఫిలిమ్స్ చిత్రాలంటే మృగాలుండాలని ప్రేక్షకులు ఎదురు చూడడం సహజం దుర్మార్గులను సన్మార్గులను చేసే పసిపాప, ఆ పసిపాపను రక్షించే సింహం, ఎంతో మేలు చేసే ఏనుగు- ఒక్కముక్కలో చెప్పాలంటే అన్ని తరగతుల ప్రేక్షకులను ఆకర్షించే అంశాలున్నాయి." అన్నారు నిర్మాత సి దండాయుధపాణి "దేవర్ ఫిలిమ్స్ వారు ఎంతో క్రమశిక్షణతో చిత్రాలు తీయడంలో ప్రసిద్ధి పొందినవారు వీరు ఏ భాషలో చిత్రం తీసినా హిట్ అవడం తథ్యం అందుకే ఈ చిత్రం చూసిన వెంటనే తెలుగు హక్కులను పొందడం నాకెంతో ఆనందంగా ఉంది, గర్వంగా కూడా ఉంది." అన్నారు నిర్మాత పి పేర్రాజు అతి త్వరలో విడుదలయ్యే ఈ చిత్రంలో విజయకాంత్, నంబియార్, కన్నడ ప్రభాకర్, శ్రీకాంత్, నళిని, ఇళవరిసి, బేబి సోని నటించారు సత్యమూర్తి సంభాషణలు, ఇళయరాజా సంగీతం, రామమూర్తి ఛాయతో మారియప్పన్ ప్రొడక్షన్ డిజైనర్



డాన్సు డైరెక్టరుగారూ! మీరు కరాటే మాష్టారుతో కలసి ఒక యుగళ గీత సన్నివేశానికి స్టెప్స్ తయారు చేయాలి!

## వంశీ దర్శకత్వంలో చిత్రాలు

"అన్వేషణ, ప్రేమించు-పెళ్లాడు." అనంతరం భానుప్రియ, మోహన్, సత్యనారాయణ ప్రభృతులతో హరిత చిత్ర నిర్మించే సంగీత ప్రణయ గాథ "ఆలాపన", భానుచందర్, సుహాసిని నాయకా నాయికులుగా విదేశాల్లో తయారయ్యే చిత్రానికి వంశీ దర్శకత్వం వహించనున్నారు

మేము కట్నాలు కానుకలు ఇచ్చుకోలేము
కాని నాగార్జున సిమెంట్ తో కట్టిన మేడ పెళ్లికూతురు పేరున ఉందిగా. అంతకంటే ఏంకావాలండీ
అదిబాలు
SATYAMURTY-MAM N.C.

## సినిమాస్కోప్‌లో "కాలేజి కుర్రాళ్ళు"

కామెడీ సెంటిమెంట్ సందేశం మిళితంగా చిన్న తారలతో భారీ బడ్జెట్‌లో తయారు చేస్తాం మే జూన్ నెలల్లో పూర్తిగా అవుట్‌డోర్‌లో షూటింగ్ ముగిస్తాం ఎ కోదండరామిరెడ్డి వద్ద అనేక చిత్రాలకు సహకార దర్శకుడుగా అనుభవం గడించిన అభ్యుదయ భావాలు గల యువకుడు శివప్రసాద్‌కు రచన దర్శకత్వ బాధ్యతలను అప్పగించాం అన్నారు విష్ణుప్రియా ప్రొడక్షన్స్ అధినేత జాగర్లమూడి రాధాకృష్ణమూర్తి ఈయన నిర్మించే సైరొమాంటిక్ చిత్రంలో కపిల్‌దేవ్ హీరో

## "దొంగల్లో దొర" మే విడుదల

రీరికార్డింగ్ మిక్సింగ్ అంతా పూర్తయి పోయాయి చక్కని సెంటిమెంట్‌తో కూడుకున్న ఈ చిత్రంలో సుమన్ ద్విపాత్రాభినయం స్పెషల్ అట్రాక్షన్ అని రషెస్ చూసిన ప్రతివారూ అంటూంటె మా ఆనందం వర్ణనాతీతం అన్నారు ఎ సారధి ఈయన నిర్మించిన నాగార్జున ఆర్ట్ పిక్చర్స్ వారిపై చిత్రంలో విజయశాంతి అరుణ నాయికలు సత్య నారాయణ ప్రభాకరరెడ్డి వేలు వల్లం నరసింహారావు ఉదయకుమార్ కాకినాడ శ్యామల ఇతర పాత్రధారులు సత్యానంద్ సంభాషణలు కీర్తి ఎస్ పి బాలసుబ్రహ్మణ్యం స్వరకల్పనలో వేటూరి గోపి గీతాలు రాశారు ఛాయ వి రఘు ఛాయ తోట యాదు శిల్పం పి పుల్లారావు సహకార దర్శకత్వం పసుపు నృత్యాలు నాయని మహేశ్వరరావు కూర్పు రాజా ప్రొడక్షన్‌తో బత్తుల వెంకట నారాయణ సమర్పించే ఈ చిత్రానికి విజయ బాపినీడు దర్శకుడు


అనూరాధ "మంత్రదండం"లో

## "విష కన్య"లో సర్పగండం

నాగలోకం నాగరాజు (వీరభద్రరావు) సింహాసనం మీద కూర్చున్నాడు కేతకీ' అని పిలిచాడు

కేతకి (నాగరాజు) ముందుకు వచ్చి నమస్కరించాడు "కేతకీ' ఈ రోజు బదరికావనవాసి నిత్యానంద మహాముని సర్పగండం వలన మరణించాల్సి ఉంది తక్షణమే బయల్దేరు మరో యామంలో అతన్ని కాటుందుకోవాలి" అని ఆజ్ఞాపించాడు

"ప్రభూ' ఎవరికీ ఏ అపకారం తలపెట్టని మునిపుంగవుని కాటు వేసి అతని చావుకి కారణం కమ్మంటారా?" వినమ్రంగా మనవి చేశాడు కేతకి

"కేతకీ' పుట్టినవాడు గిట్టక తప్పదు ఒక్కొక్కరికి ఒక్కొక్క విధంగా మరణాన్ని నిర్దేశిస్తాడు బ్రహ్మదేవుడు ఆయన ఆదేశాల మేరకు సర్పగండంతో మరణించవలసిన వారిని కాటు వేయడం మన బాధ్యత నీ పాము కాటు కేవలం ఒక మిష మాత్రమే పాప పుణ్యాలతో మనకు పనిలేదు మా కుటుంబమే తరతరాలుగా సర్పగండంతో మరణించవలసిన వారిని కాటు వేయడం సంప్రదాయంగా కొనసాగుతోంది సంశయం వదలి కాలాతీతం కాక ముందే బయల్దేరు

"ఆజ్ఞ ప్రభూ' అయిష్టంగా తలొంచి కేతకి వెనుతిరిగాడు మరో క్షణంలో నాగుపాముగా మారిపోయాడు

విజయబాపినీడు సమర్పణలో కె ఎం సుబ్బారాయుడు, ఎం హెచ్ శ్రీనాథ్ నిర్మించిన శ్రీ రమణా మూవీస్ విషకన్య చిత్రానికి రవితేజ దర్శకుడు



"మొగుడూ పెళ్ళాలు"లో భానుప్రియ

"దర్జాదొంగ"లో సుమన్, విజయశాంతి



## మాదాల "ఎర్రమట్టి"

మట్టి మనుషులలో తరాల తరబడి పేరుకున్న మౌఢ్యం తొలగి చైతన్యం రాజుకుంటే మట్టి ఎర్రనవుతుంది భూమాత కన్నీర్ర /జేస్తుంది మట్టిలో పుట్టి, మట్టిలో పెరిగి మట్టి మనుషులుగా పిలవబడే గ్రామీణుల జీవితానికి దర్పణం ఈ చిత్రం కొందరు కొత్త నటీనటులను పరిచయం చేస్తున్నాం మార్చి 21 నుంచి నెలాఖరు వరకు జరిగిన మొదటి షెడ్యూల్‌లో మూడు పాటలను రాత్రి వేళల్లో పిక్చరైజ్ చేశాం ఏప్రిల్ మే నెలల్లో జరిగే రెండు షెడ్యూల్స్‌తో షూటింగంతా పూర్తయిపోతుంది అన్నారు మాదాల రంగారావు ఈయన నాయక పాత్ర నిర్వహిస్తూ నిర్మాణ సారథ్యం వహించే నవతరం పిక్చర్స్ వారి ఈ చిత్రానికి కొసరాజు పాటలు, పార్థసారధి సంగీతం ఆర్ రామారావు ఛాయ శేషు నృత్యాలు హనుమంతరావు శిల్పం చౌదుల సుబ్బారావు కూర్పుతో ధవళ సత్యం దర్శకుడు

## "నా పేరే దుర్గ"

"జయప్రద ఒక ప్రత్యేక పాత్రలో కనిపించడం విశేషం ఏప్రిల్ 4 నుంచి 10 వరకు మొదటి షెడ్యూల్ జరిగింది రెండవ షెడ్యూల్ మే 1 నుంచి 15 వరకు జూన్‌లో జరిగే పాచ్‌వర్క్‌తో షూటింగ్ పూర్తవుతుంది." అన్నారు టి చిట్టి ఈయన దర్శకత్వంలో వరకాంతం మనోహరరెడ్డి నిర్మించే అశ్వచిత్ర వారి "నా పేరే దుర్గ" చిత్రంలో స్మిత రాజా రాజేష్, గొల్లపూడి, పి ఎల్ నారాయణ, శ్యామల రావు టెలిఫోన్ సత్యనారాయణ రాజబాబు ముఖ్య భూమికలు నిర్వహిస్తున్నారు పినాచక్రవర్తి కథ జి ఎ రాఘవులు సంగీతం రఘు – రమేష్ ఛాయ తోట యాదు శిల్పం, మోహన్ కూర్పు, శివారెడ్డి సహకార దర్శకత్వం, మూర్తి ప్రొడక్షన్‌తో నాళం శ్రీరామమూర్తి, గోగుల నాగిరెడ్డి సహ నిర్మాతలు సమర్పణ కోసన వెంకటేశ్వరరావు □

## స్థానభ్రంశం చెందిన శిశువు గుండె

టాంజనియాలో ఒకామెకు పుట్టిన శిశువు గుండె కాయ ఆ పిల్లాడి శరీరం బయట వున్నదట ఆ పిల్లాడు పుట్టిన తొమ్మిదో రోజున ప్రొఫెసరు పి జె పిలిప్ గారు కొంత మంది డాక్టర్ల సహాయంతో శస్త్ర చికిత్స ద్వారా ఆ పిల్లవాని గుండెను యధాస్థానంలో పెట్టి జయప్రదంగా ఆపరేషన్ ముగించారట

## కూతుర్ని వెలయాలుగా మార్చిన తండ్రి!

'కైకారం గ్రామానికి చెందిన రామయ్య అనే వో త్రాగుమోతు ధనార్జన కోసం తన 20 ఏళ్ళ కూతుర్ని వ్యభిచారంలోకి దింపి, ఆమెకు అండగా వుండడం కోసం మరో యిద్దరమ్మాయిలను కూడా దీనిలో దింపి వో వ్యభిచార గృహంగా తన సంస్థను మలచాడట ఈతను తన కూతురుతో దారి కాసి, లారీల నాపి ఆ డ్రయివర్లతో మంతనాలాడి, తన వ్యాపారం చక్కగా చేసుకునేవాడట వోనాడు అతని పాపం పండి పోలీసులకు దొరికాడట

## బస్సు ప్రయాణంలో గొర్రెకు గల మక్కువ!

కేరళలో బొట్టనికార అనే వూరు నుంచి ఓ సిటీ బస్సు త్రిపునితుర వెళ్తూంటే ఒక బస్‌స్టాపులో ఓ గొర్రె క్యూలో నిలబడిందట అందరితోపాటు అదీ లోపలకు ఎక్కి డ్రయివరు వెనకాల చోటు చూసుక్కూర్చుందట ఆ గొర్రె వోనరెవరూ ఎక్కనందువల్ల, మార్గాంతరం లేక కండక్టరు వూరుక్కున్నాట్ట అది మళ్ళీ చీకటి పడ్డాక త్రిపునితుర నుంచి బొట్టనికార వెళ్ళే బస్ స్టాపులో నించుందట మళ్ళీ ఎక్కి స్థిరపడిందట ఆ మర్నాడు యిలాగే చేసిందట గత రెండు నెలలకుపైగా రంచనుగా ఎక్కి, రంచనుగా అదే టయిముకు తిరిగి



వస్తోంటట కండక్టరు ఈ గొర్రెను ఫ్రీ పాసింజరుగా వదిలేస్తున్నాడట

## సున్నా ఓట్లు వచ్చి రికార్డు సృష్టించిన ఘనుడు!

సిక్కిం ఎన్నికలలో సిక్కిం ప్రజాతంత్ర కాంగ్రెసు అభ్యర్థికి, మరో ఇండిపెండెంటు అభ్యర్థికి చెరో వోటు వచ్చిందట– బహుశా వాళ్ళు వేసుకున్నదే అయ్యుండాలా వోటు కర్నాటకలో ఎ ఆర్ యాజిత్ అనే అభ్యర్థికి ఆ ఒక్క వోటు కూడా రాలేదట అనగా ఆయన వోటు కూడా ఆయన వేసుకోలేదట కేవలం సున్నా వొచ్చి రికార్డు స్థాపించాడటా మహనీయుడు

## దొంగల్ని పట్టిచ్చిన క్యాలండర్లు!

ఒక ట్రాన్స్‌పోర్టు కంపెనీ తాలూకు క్యాలండర్లు బొంబాయిలోని కొందరు గుడిశ నివాసుల యిళ్ళల్లో గోడలకు వున్నాయట ఈ క్యాలండరులు బొంబాయిలోని వో యిద్దరు ఆడ దొంగల్ని పట్టిచ్చాయట మద్రాసుకు చెందిన ఇద్దరాడవాళ్ళు ఒక లారీ కంపెనీ తలుపులు పగలేసి కొన్ని సరుకులూ, ఓ క్యాలండరు కట్టా ఎత్తుకు పారిపోయారట ఆ క్యాలండర్లు గుడిశ నివాసులకు పంచారట పోలీసులు వీరిద్వారా ఆ ఆడ దొంగలను పట్టి, వారి వద్దనున్న 25 వేల దొంగ సొమ్ము స్వాధీనపరుచు కున్నారట

## మనసు విరిగి ఆత్మహత్య!

వేలూరుకు చెందిన 23 ఏళ్ళ దురై అనే అతను తన బార్య 19 ఏళ్ళ నాగమ్మను మొన్న సంవత్సరాదినాడు తనకు ఉదయం పదింటికి కోడిగుడ్డు కూరతో సహా అన్నం పెట్టాలని ఆనక తనకు అర్జంటు పని వుందని ముందే చెప్పినా ఆమె అన్నం సిద్ధం చేయకపోడమేగాక, అందుకు సన్నాహం కూడా చేయలేదట దాంతో దురైకు కోపం వచ్చి అరవంలో నానా తిట్లూ తిట్టి విసవిసా వెళ్ళిపోయాట్ట ఆ తిట్లకు ఆతని తండ్రి చరణం అందుకుని సాగదీశాడట దానివల్ల మనసు విరిగిన నాగమ్మ ఒంటిగంటకు మొగుడికి నవకాయ పంది వంటలతో అన్నంపెట్టి ఆనక విషం త్రాగి చనిపోయిందట

## ఆగ్రహంతో హత్య!

మహారాష్ట్ర అంద్ గ్రామంలో వో రెండు కుక్కలు రతి క్రీడలో వుండడం చూసి మరికొన్ని కుక్కలు బొయ్ భొయ్ లాడసాగాయట వాటిని హర్బాసింగ్ షేర్ అనే అతను తరమబోయేసరికి సలీమ్ అనే అతనొచ్చి వాటిని తరమడానికి నువ్వెవడివి అని అతనితో జగడానికి దిగాడట ఆ జగడం మాట మాట నుంచి కొశ, కొశ ముష్టా ముష్టిక వెళ్ళిందట హర్బాసింగ్ షేర్ ఎగిరి గంతేసి కత్తితో సలీముని కస కస పొడిచి, చంపేశాడట

## విహారానికి వచ్చి పట్టుబడిన మొసళ్ళు!

తమిళనాడు కుంభకోణానికి చెందిన కరుంబూరు చూడ్డానికి వో రెండు పెద్దసైజు మొసళ్ళు వెళ్ళాయట అవి యధేచ్ఛగా రోడ్ల వెంట తిరుగుతూ వుంటే జనులు ఒకదాన్ని బంధించారట రెండోది వూళ్ళోని నీళ్ళ కొలనులో దూరిందట ఈ మొసళ్ళు ఒక్కొక్కటి మూడేసి మీటర్ల పొడుగున్నాయట నీళ్ళల్లో దూరి దాక్కున్న మొసలిని పారెస్టు అధికారులు 24 గంటలు మాటువేసి పట్టుకున్నారట ☐






# మన శరీరానికి అప్‌కోస్-డి అవసరం

మనం మేలుకొని ఉన్నా, నిద్రావస్థలో ఉన్నా, పని చేస్తున్నా, విశ్రాంతి తీసుకొంటున్నా మన శరీరానికి నిరంతరమైన శక్తి సరఫరా అవసరం. ఈ శక్తి వల్లనే శరీరం తన సాధారణ ఉష్ణోగ్రత నిలిపి ఉంచుకోవడానికి సహాయమవుతుంది. శక్తి సరఫరా లేకుంటే మనం లేమన్నమాటే.

మన శరీరం బంగాళాదుంపలు, గోధుమలు, బియ్యం, బీట్‌రూటు వంటి ఆహార పదార్థాలలోని పిండి పదార్థాన్ని అణువణువులుగా విడగొట్టి చివరికి గ్లూకోజ్‌గా రూపొందిస్తుంది. ఈ గ్లూకోజే రక్తంలోనికి పీల్చుకోబడి శరీరానికి అవసరమైన శక్తి అందడానికి కారణమవుతుంది. ఆహారాన్ని గ్లూకోజ్ కింద మార్చే ప్రక్రియ నిదానమైనది. దీనివల్ల, అనారోగ్యము సరాలవత్తిడి. అలసట వంటి స్థితులలో శరీరానికి అవసరమైన అధిక శక్తి సరఫరా కావలసినంతగా జరగక పోవచ్చు. ఈ సమయాలలో శీఘ్ర శక్తి నిమిత్తం నోటిద్వారా శుద్ధమైన గ్లూకోజ్ రూపంలో శరీరానికి శక్తి అవసరమవుతుంది.

అప్‌కోస్-డి ఇట్టి సమయాలలో అత్యంత శ్రేష్ఠమైనది. అప్‌కోస్-డి పిల్లలలోను, పెద్దలలోను కూడా ఖర్చైన శక్తిని తిరిగి అందించడానికి వాడదగినది.

అప్‌కోస్-డి గ్లూకోజ్‌తో బాటుగా ఎముకలకు, నరముల ధాతువుకొరకై కాల్షియం భాస్వరాలను, కాల్షియంను సరిగా ఉపయోగించుకునేందుకై విటమిన్-డిని కూడా అందిస్తుంది

అప్‌కోస్-డి తక్షణ శక్తినిస్తుంది. దీనిని మంచి నీళ్లతోగాని, వేడి లేదా చల్లని పానీయాలతోగాని తీసుకోవచ్చు.

మీకు అదనపు శక్తి, అదీ క్షణంలో కావలసినప్పుడు అప్‌కోస్-డిని గుర్తు తెచ్చుకోండి!

అప్‌కోస్-డి అజంతా ఫార్మా వారి సగర్వ ఉత్పాదన

## అప్‌కోస్-డి ®
**(గ్లూకోస్-డి)**

**అప్‌కోస్-డి అంటేనే తక్షణ శక్తి**

ఉత్పాదకులు: ap

**అజంతా ఫార్మా ప్రైవేట్ లిమిటెడ్**

243, కళ్యాణ్‌దాస్ ఉద్యోగ్ భవన్,
వర్లీ, బొంబాయి 400 025









INNOVATION/AP/TEL/10

సీరియల్

# రాగసంధ్య

కాశీనాథుని సువర్చలా దేవి

## [గత సంచిక తరువాయి]

'**కా**ళ్ల నెప్పులుగా ఉన్నాయా' దిగేముందు అడిగాడు శ్రీకాంత్.

లేదని తలవూపినా సంధ్య ముఖంలో అలసట స్పష్టంగా కనపడుతూనే వున్నది. కింద దిగగానే కొబ్బరి నీళ్ళు తాగి బయలుదేరారు. సంధ్య మధ్య దారిలో ఆలోచించటం మొదలుపెట్టింది. తను శ్రీకాంత్‌తో కలిసి తింటున్నది. అతని మంచంమీద పడుకుంటున్నది. నిన్న ఆలయంలో ధర్మపత్నిగా సంకల్పించబడింది. తన వ్రతం సాగుతున్నట్టా! ఈ వ్రతానికి అర్థం వుందా! తన మనసు ఇంతవరకు లొంగిపోయింది. ఇంకా లొంగపోదన్న నమ్మకం తనకు లేదు. దీనికి ఒకటే మార్గం! అతనికి విడాకులివ్వాలి. అదొక్కటే మిగిలిన ఆశ! అప్పుడు అతను నిరభ్యంతరంగా మరో స్త్రీని వివాహం చేసుకుంటాడు! తన జీవితంలో ఆనందాన్ని పొందుతాడు. అప్పుడుగాని ముసురుకున్న ఈ కృష్ణపక్షం తొలిగిపోదు! చీరల సెలక్షనప్పుడు కూడా సంధ్య ముభావంగానే వుంది. ఆమె మనసంతా విడాకుల మీదే వుంది. శ్రీకాంత్ సంధ్యను కూడా చీరలు తీసుకోమన్నాడు మామూలు ధోరణిగానే వద్దంటుందనుకున్నాడు. కాని, అతన్ని ఆశ్చర్యంలో ముంచుతూ తను కూడా చీరలు తీసుకున్నది. సంధ్య మనసేమిటో ఎప్పుడు ఏ రకంగా ప్రవర్తిస్తుందో అర్థంకాక శ్రీకాంత్‌కి ఒక్కోసారి మతిపోయే పరిస్థితి వస్తుంది. ఇల్లు చేరేసరికి రాత్రి తొమ్మిదయింది తెల్లవారితే శ్రీకాంత్ ప్రయాణ మనగా మూర్తి కొడుక్కి పేరు పెట్టమన్నాడు. అట్టహాసంగా బారసాల తంతు అతనికి ఇష్టం లేదుట. శ్రీకాంత్‌కి ఆ క్షణంలో ఏ పేరూ స్ఫురించలేదు. సంధ్య నడిగాడు.

'రాధికాప్రసాద్' అని పెడ్తే బాగుంటుందేమో అంది. మూర్తి ముఖంలో సంతోషం కనపడింది. శ్రీకాంత్‌కి కూడా నచ్చింది. గీత మనసులో ఏముందో కాని పైకి మాత్రం బాగానే వుంది. ఆ తెల్లవారు ఝామునే శ్రీకాంత్ సంధ్యతో బయలుదేరి వెళ్ళిపోయాడు.

★ ★ ★

హైదరాబాదు వెళ్ళిన రోజే సంధ్య ప్లీడరుతో సంప్రదించటానికి వెళ్ళింది. ఇటువంటి కేసులు సమర్ధవంతంగా నిర్వహించే వకీలు పద్మనాభరావు దగ్గరకెళ్ళి వివరాలన్నీ చెప్పింది ఇంటికి వచ్చి తన గదిలోకి వెళ్ళిందో లేదో ఫోను మోగింది. శ్రీకాంత్ అక్కడే వున్నాడు ఫోను అందుకున్నాడు.

''ఏమిటీ ?... నిజంగా చెప్తున్నావా ! అవును ...''

'..................'

''నాకు తెలియదు''

''........... ......''

''నేను కనుక్కునేదేమిటి ? నువ్వు చెప్తున్నావుగా ... ఇక అవసరం లేదు ...''

''... .................''

''సాధ్యమవుతుందా ...''

''. ....... .........''

''సరే, ఆలోచిస్తాను !''

సంధ్యకి తలాతోకా అర్థం కాలేదు. శ్రీకాంత్ సంధ్యరాక గమనించి నఖశిఖ పర్యంతం పరిశీలనగా చూచాడు. అతని కళ్ళల్లో కోపం స్పష్టంగా కనపడుతున్నది. ఇంతలో మళ్ళీ ఫోను మోగింది. సంధ్య చూస్తూ నిలబడింది. శ్రీకాంత్ అందుకున్నాడు.

''మధూ !...నువ్వా...అబ్బ ఎన్నాళ్ళయింది నీగొంతు విని !
ఏమిటి ? కొడుకు పుట్టాడా ! చాలా సంతోషంగా వుంది!''

... ... ...

''అట్లాగే...వెయ్యి కళ్ళతో ..!''

ఫోను పెట్టేశాడు శ్రీకాంత్. కోపం ఎగిరిపోయింది.

''సంధ్యా ! మధు మాట్లాడాడు, సంధ్యా ! మధుకి కొడుకు పుట్టాడు తెలుసా ! వాడికి శ్రీకాంత్ అని పేరు పెట్టాడుట. నాకెంత సంతోషంగా వుందో ! మధుని చూసి మాట్లాడి ఎన్నాళ్ళయింది? వాడి గొంతు వింటుంటే నాకు ప్రాణం లేచి వచ్చింది !'' హుషారుగా చెప్పుకు పోతున్నాడు శ్రీకాంత్. సంధ్య గిరుక్కున తిరిగి అక్కడ్నుంచి వెళ్ళిపోయింది. ఆ రాత్రి సంధ్య భోజనం చెయ్యలేదు. మెదలకుండా తన మంచం మీద ముసుగు పెట్టుకు పడుకుంది. శ్రీకాంత్‌కూడా పడుకున్నాడు కాని అతని మనసు విపరీతంగా బాధపడుతుంది. లాయరు పద్మనాభరావు తనకి చాలా ముఖ్య స్నేహితుడు. సాయంత్రం ఫోను చేసి చెప్పాడు సంధ్య తన నుంచి విడాకులు కోరుకుంటున్నదని! తనేం చేశాడని ! ఎన్నో విధాల సంధ్యను ఈ దుఃఖ వలయం నుంచి బయట పడెయ్యాలని ప్రయత్నం చేశాడు ! ఎన్నో వ్యాపకాలు పెట్టుకుని తను కాలక్షేపం చెయ్యవచ్చు ! అన్నీ కాదన్నది ! తన నీడ కూడా ఆమె మీద పడకుండా తను జాగ్రత్తపడ్డాడు. తనేం సాధించాడు ! తను పొరపాటు చేశాడు. అందరిలా శాసించి భర్తగా అధికారాన్ని సంపాదించ వలసింది. కాదు — కాదు. అది సరయిన అనురాగం కిందకు జమవుతుందా ! తను ధైర్యంగా సంధ్య ముందు నిలబడగలడా! అసంభవం! సంధ్య

---

**జరిగిన కథ-14:** సంధ్య, మధులు ప్రేమించుకొంటారు కాని పెళ్ళి చేసుకోలేకపోతారు. తన చెల్లెలు భవిష్యత్తు బాగుకై మధు మాధవిని చేసుకొంటాడు. అనుకోని పరిస్థితులలో ఇష్టం లేకపోయినా గీత కోసం సంధ్య మధు స్నేహితుడు శ్రీకాంత్‌ను వివాహం చేసుకొంటుంది. గీత పెళ్ళి మూర్తితో జరిగిపోయింది. మూర్తి మొదటి భార్య రాధ పిచ్చిలో తోయడం వల్ల మూర్తి తల్లి మరణించింది. మూర్తి రాధను ఆసుపత్రిలో చేర్పిస్తాడు. మూర్తి, గీత శ్రీకాంత్ వాళ్ళింటికి వచ్చారు. ఎంత సర్దుకున్నా సంధ్య మనస్సు శ్రీకాంత్‌ను భర్తగా అంగీకరించదు. ఆమె మధుకి రాసిన ఉత్తరం శ్రీకాంత్ చదువుతాడు సంధ్య మెడలో మాంగల్యం తెంపేయబోతే వారిస్తాడు శ్రీకాంత్. మూర్తి, గీత ఊర్లు తిరగను వెళతారు. సంధ్య మళ్ళీ ఉద్యోగంలో చేరింది కానీ అక్కడి వారి సంభాషణలు భరించలేక మానేసింది.సంధ్య మనసు శ్రీకాంత్ పట్ల మృదువుగా మారుతుంది. మూర్తి మొదటిభార్య రాధ మరణించింది. రాధ మరణానికి తనే కారణం అని తలపోసిన మూర్తి ఇల్లు విడిచి వెళ్ళిపోయాడు. గీత తల్లితో కలసి బెంగుళూరు వెళ్లి పోయింది. శ్రీకాంత్ సంధ్యను భార్యగా కాకపోయినా ఒక స్నేహితురాలుగానన్నా మసలుకోమని కోరుతాడు. శ్రీకాంత్ స్నేహితుడు ప్రకాష్ దగ్గర సెక్రటరీగా ఉన్నది మూర్తేనని తెలుసుకొంటారు. మూర్తి, గీతల జీవితం కుదుట పడింది.

తనకు తానై తన దగ్గరకు రావాలి! తనీ దారుణ సంసారం జరపలేడు!

సంధ్య కూడా ఆలోచిస్తూనే వుంది.

ఆ లాయరు శ్రీకాంత్‌కి ఫోనులో చెప్పలేదుకదా! చెప్పకుండా అతనికి తెలియకుండా విడాకులెలా సాధ్యం! తనకి ఆవేశం ఎక్కువంటాడు అతను! ఆవేశంలో చేసేపనులు సత్ఫలితాల్ని ఇవ్వవట! కానీ; ఈ పని మాత్రం నిజంగా సత్ఫలితాన్నే ఇస్తుంది. తను తన మనసుని చంపుకోనక్కరలేదు. తను తన ప్రేమపట్ల అపచారం చెయ్యనక్కరలేదు. శ్రీకాంత్ భవిష్యత్తుకి శాపంలా మిగిలిపోనక్కరలేదు. తన మూలంగా తల్లీ కొడుకులు దూరంగా వుండిపోయారు. పిల్లలతో కళకళలాడవలసిన ఈ ఇల్లు ఈ రకంగా బావురు మననక్కరలేదు. శ్రీకాంత్ వంటి నిజాయితీపరులు, మనోనిగ్రహం కలవాళ్ళు చాలా అరుదుగా వుంటారు. రెండు సంవత్సరాలు తాళికట్టిన భార్యను ఏకాంతంగా ఎదురుగా వుంచుకొని ఆశ్చర్యకరమైన నిగ్రహం చూపించాడు! బలప్రయోగం చేస్తే కాదనేదెవరు? అతను సంస్కారవంతుడు. అందం, ఆరోగ్యం, సంపద వున్న అతను తనకోసం జీవితాన్ని వ్యర్థం చేసుకుంటున్నాడు. తను మోడైపోయింది కాని అతనిలో ఎదుటి వ్యక్తుల్ని ఆర్ద్రపరచగల పచ్చదనం వుంది. సారవంతమైన హృదయం వుంది. అతను గొప్ప ఆరాధకుడు! తపస్వి! తనవంటి తక్కువ సంస్కారంకల వాళ్ళు, అపవిత్రులు— ఈ చోటులో నిలవకూడదు. అతని హృదయ పవిత్రత తనని దహించివేస్తుంది! మలినమైన హృదయ పద్మం అర్చనకి పనికిరాదు! ఎండిపోయిన మాధవీలత గున్నమామిడి చెట్టును అల్లుకోలేదు! తన మనస్సరోజము విధివిసిన వడగాలికి వడిలిపోయింది! ప్రేమించటానికి తనకి హృదయం లేదు! హృదయంలేని శరీరం దహన యోగ్యం! తనకి నిష్కృతి లేదు. తన మనసు కోరుకునే కోరికల స్వరూపంకూడా తనకి తెలియటంలేదు మధు మాధవితో సుఖంగా వున్నాడు! కొడుకుని కన్నాడు! నిజంగా తనని మర్చిపోయాడా! నిష్కల్మష హృదయంతో మాధవిని స్వీకరించాడా! పొరపాటున కూడా తను అతని స్మృతిలోకి రాదా! ఒక వ్యక్తి స్వచ్ఛంగా వున్న తన మనోఫలకం మీద ఒక వ్యక్తినే చిత్రించుకో గలడుగాని రెండు రూపాల్ని చిత్రించుకోవటం సాధ్యమా! మనసులో తన స్మృతులతో మాధవితో శారీరక అనుభవాలతో జీవిస్తే అది వ్యభిచారం కాదా! ఒక వేళ తన రూపం పూర్తిగా మధు చెరిపివేస్తే అది తనకి మాత్రం ఎందుకు సాధ్యంకావటంలేదు! వ్యక్తిగతమైన అనుభవమేమో అది! ప్రేమించటంలో తారతమ్యం వుందేమో! సహజంగా లలిత హృదయం గల స్త్రీలు పురుషుల్ని ఎక్కువ ప్రేమిస్తారా! పురుషులు మనస్ఫూర్తిగా హృదయంతో, త్రికరణములతో ప్రేమిస్తే ఆ ప్రేమ ముందు స్త్రీ ప్రేమ ఎంత? ముందు తనకిది పరిష్కారం కావాలి! మధుకి ఏ సమయంలోనూ ఏ పరిస్థితుల్లోనూ తను గుర్తు రాదా? వచ్చినప్పుడు అతను తనను గురించి ఏ రకంగా ఆలోచిస్తాడు — అతనికి లభించిన ఆత్మ సంయమనం తనకెందుకు లభించదు? ఎదురు పడితే అడగాలనుంది సంధ్యకు. తెల్లవారుతుండగా నిద్రపట్టింది సంధ్యకు.

★ ★ ★

సంధ్యకు మెలకువ వచ్చేసరికి బాగా పొద్దెక్కింది. కింద సందడిగా వుంది. ఎవరొచ్చుంటారు? అనుకుంటూ మంచం దిగింది — ఎదురుగా శ్రీకాంత్ ఏడాది పిల్లవాడిని ఎత్తుకుని వస్తున్నాడు సంధ్యను చూస్తూ—

''సంధ్యా! చూశావా! వీడు చిన్న శ్రీకాంత్. మధు కొడుకు!'' ఎగరేసి పట్టుకుంటూ అన్నాడు శ్రీకాంత్.

సంధ్య కొయ్యబారిపోయింది. తను, తన కళ్ళతో మధు కొడుకును చూస్తున్నది. వాడు అచ్చు మధులాగే వున్నాడు. కాకపోతే బాగా తెల్లగా బొద్దుగా మిసమిస లాడుతున్నాడు. చలిదేశంలో వున్నాడేమో రంగుకి బాగా వన్నెవచ్చింది. వాడు ఏమాత్రం కొత్త లేకుండా పకపకా నవ్వుతున్నాడు. సంధ్య అట్లాగే చూస్తూ నిలబడిపోయింది.

''సంధ్యా! మధు భార్యతో వచ్చాడు. నిన్ను అర్థంచేసుకోగలను, కాని, మాధవి వుంది— చదువుకున్నదానిలా ప్రవర్తించు. మధు చూడు— ఎంత ప్లైన్‌గా ఏమీ జరగనట్టు మామూలుగా స్నేహితుడుగా చుట్టంగా వచ్చాడు— నువ్వు అంతకంటే నిర్లక్ష్యంగా కేవలం నా స్నేహితుడు అన్నట్టుగానే వుండాలి— తెలిసిందా! ధైర్యం తెచ్చుకో! ప్రశాంతంగా మనసుని అదుపులో వుంచుకున్నావంటే నిన్ను భగవంతుడు కూడా ఏమీ చెయ్యలేడు— అసలేం జరిగిందని? అంత కొంపలంటుకునే భయంకర విషయాలేవీ లేవుగా! యాక్సిడెంటల్‌గా మేమిద్దరం స్నేహితులమయాం— అంతే పద—నాకోసంరా! మాధవిని దృష్టిలో పెట్టుకో''

శ్రీకాంత్ మాటలలో ప్రేమ, అనురాగం, లాలన, హెచ్చరిక, ఉపదేశం, ఆజ్ఞ, అనుభవం— ఎన్నో— ఎన్నో వినపడ్డాయి సంధ్యకు.

నిజంగా శ్రీకాంత్ దేముడే అనిపించింది సంధ్యకు.

సంధ్య ఒక్కొక్క మెట్టే దిగుతూ తను పాతాళంలోకి దిగిపోతున్నట్టు అనుభూతి చెందసాగింది. ఒకచేత్తో చిన్న శ్రీకాంత్, పక్కన సంధ్యతో శ్రీకాంత్ హాలులోకి వచ్చాడు

మధు ఆదరంగా ఎదురు వచ్చాడు.

''సంధ్యా! బాగున్నావా!''

సంధ్య తలెత్తలేకపోయింది చూడలేకపోయింది. ఆమె గుండెలు ఆగిపోయేలా కొట్టుకుంటున్నయి. ఒళ్ళంతా చెమటతో తడిసిపోయింది

''మాధవీ! మీట్ మై వైఫ్—'' శ్రీకాంత్ అన్నాడు.

సంధ్య బలవంతంగా తలెత్తి అతి ప్రయత్నంమీద పెదవులమీద



# రాగసంధ్య

చిరునవ్వు తెచ్చుకోగలిగింది. అది నవ్వో ఏడుపో ఆమెకే తెలియలేదు.

"కాఫీ తెస్తాను!" దాదాపు ఎవరో తరుముతున్నట్టే లోపలికి వెళ్ళిపోయింది. వంటింట్లో మూలగా కూర్చుని చాలాసేపు మనసుని అధీనంలోకి తెచ్చుకోవటానికి ప్రయత్నం చేసింది తరువాత మెల్లగాలేచి ముఖం కడుక్కుంది. చల్లని నీళ్ళతో ముఖం కడుక్కున్న తరువాత కొంత సుఖంగా వుంది. మంగి వేడివేడి ఇడ్లీలు ప్లేట్లలో సర్ది డైనింగ్ టేబిల్ మీద పెట్టింది. అందరూవచ్చి కూర్చున్న తరువాత శ్రీకాంత్ "సంధ్యా!" అని పిలవటంతో సంధ్యకు వెళ్ళక తప్పలేదు. అప్పటికే పిలిచిన పది నిము షాలకి వెళ్ళింది.

"మీరుకూడా రండి—మాతో కూర్చుందురుగాని!" మాధవి అంది. సంధ్యకు ఒళ్ళంతా చిన్నచిన్న సూదులు పెట్టి పొడుస్తున్నట్టనిపించింది.

"కూర్చో సంధ్యా! నీ కోసం ఆగాం!" మధు అన్నాడు.

అప్పటికీ సంధ్య మధు వంక చూడలేదు, అవమానంతో ఆమె హృదయం దహించుకు పోతున్నది. ఒక బలమైన ఈటెతో మధుని పొ డి చి పొ డి చి చిత్రవధ చెయ్యాలనిపిస్తున్నది. సిగ్గు లేకుండా ఏ మొహం పెట్టుకుని వచ్చాడు? అసలు తనని మధ్యలో పెట్టుకుని శ్రీకాంత్, మధు— ఒకరి ముఖాలొకరు ఎట్లా చూచుకుంటున్నారో సంధ్యకి అర్థంకాలేదు. తను— తను మాత్రం— ఇద్దరికీ ప్రత్యక్ష సాక్షిగా నిలబడ్డది— ఒకరికి ప్రియురాలు! ఒకరికి ఇల్లాలు— వాళ్ళకి లేకపోతే అభిమానం తనకున్నది. తన తలెందుకు పగిలిపోవటంలేదో సంధ్యకి తెలియటం లేదు ఎప్పుడైనా మధుని జీవితంలో ఒకసారి కలుసుకుని తన హృదయ వేదన తగ్గేవరకూ తిట్టాలనీ, ఎన్నో అడగాలని అనుకుంది! కాని, ఇట్లా ఇద్దరికీ ఒకేసారి ఎదురు పడవలసి వస్తుందనీ పొరపాటున కూడా అనుకోలేదు. తను ఈ అధర్మ భావవ చెయ్యలేదు. మధుని ఆప్యాయంగా పలకరిస్తున్నాడు శ్రీకాంత్. శ్రీకాంత్‌తో మామూలుగా పూర్వంలాన్నే మాట్లాడుతున్నాడు మధు! ఇద్దరూ ఎంత నాటకం ఆడుతున్నారు! ఇద్దరికిద్దరే మహా గొప్ప నటులు! దీనికి సంస్కారం అని పేరు పెట్టుకుంటున్నారు! తను ఈ వంచన సహించదు! జీవితాల్ని కోడి పందాలు లాగా మలచుకున్నారు. ఇది అన్యాయం! ముఖాముఖీ తేల్చుకోని — పోట్లాడుకొనో, తిట్టుకునో, కొట్టుకునో ఏదో ప్రళయం జరగాలి! అంతేకాని ఈ వయగారం, వంచన తను సాగనివ్వదు! మనసులో కుళ్ళు! పెదవుల మీద నవ్వు! ఇది మనుషులు చేసే పని కాదు! రాక్షసులు చేస్తారేమో తెలియదు!

మధు! మధు చిన్న శ్రీకాంత్‌కి ఇడ్లీ తినిపిస్తున్నాడేమో — వాడు గ్లాసు దొర్లించాడు. ఆ నీళ్ళు డైనింగ్ టేబుల్‌మీద నుంచి దొర్లి సంధ్య ఒళ్ళో వచ్చి పడ్డాయి. అప్పుడే అప్రయత్నంగా తలెత్తి చూసింది సంధ్య!

"నీళ్ళు పడ్డయ్యా!" అంటూ మధు కూడా చూచాడు

క్షణకాలం ఇద్దరి కళ్ళూ కలుసుకున్నాయి. మధు కళ్ళు మామూలుగా ఎంతో ప్రసన్నంగా వున్నాయి! ఆ కళ్ళల్లో ఆమె పట్ల వినయం, గౌరవ భావం కనపడిందే తప్ప ఆమె ఊహించిన ఏ భావమూ ఆ కళ్ళల్లో లేదు. మాధవి కూడా కంగారుగా లేచింది. మధు కొడుకుని ప్రేమగా పొదవి పట్టుకుని "పోకిరీ వెధవ! అల్లరి!" అంటూ ముద్దు చేస్తున్నాడు. వాడు తండ్రి మెడ చుట్టూ చేతులేసి చుట్టుకు పోయాడు.

మధు వాడి వీపు నిమురుతూ లేచి ఎత్తుకున్నాడు. సంధ్య చీర మార్చుకోవటానికి లోపలికెళ్ళింది! వాళ్ళకి కాఫీలు మంగి తీసుకు వచ్చింది. మాధవి, మధు హాలులోకెళ్లారు. శ్రీకాంత్ సంధ్యని సాయంత్రం వరకు వాళ్ళతో వుంచటానికి విశ్వ ప్రయత్నం చెయ్యవలసి వచ్చింది. ఆరు గంటలకి సంధ్య పనున్నదని వెళ్ళిపోయింది. శ్రీకాంత్ ఆమెను అను సరించాడు.

శ్రీకాంత్‌ని చూడగానే సంధ్యకి కోపం తారస్థాయికి అందుకుంది. "మీరిద్దరూ కావాలని ఈ నాటకం ఆడుతున్నారు కదూ! మధుకి నేనేం అపకారం చేశానని నా మీద ఈ విధంగా కక్ష తీర్చుకుంటున్నాడు? మీకు మాత్రం నేనేం అపకారం చేశాను? ఎన్నడైనా మీ జోలికి వచ్చానా? మొదటి నుంచీ పగబట్టిన త్రాచులా సమయం కోసం కాచుకుని కూర్చున్నారు. ఈ భయంకరమైన శిక్ష నేను భరించలేను. నన్నొక ఆటబొమ్మను చేసి మీరిద్దరూ వినోదం చూస్తున్నారు. మధుకేం? హాయిగా పిల్లల్ని కంటూ సుఖంగా వున్నాడు. ఇక్కడికి ఈ రాకపోక లెందుకు? తన పెళ్ళాన్ని, కొడుకుని చూపించుకోవాలని— నేనేరకంగా రియాక్టవుతానో చూడాలని వచ్చాడు—" సంధ్యకు దుఃఖం కన్నీరు రూపంలో వెల్లువలా బయటకు వచ్చింది. శ్రీకాంత్ ఆమె ముందు నుంచే నడిచి బయటవైపు వరండాలోకి వెళ్ళాడు. రైలింగుకానుకుని కింద తోటను చూస్తూ నిలబడ్డాడు. ఆ గదిలో లైటు కూడా లేకుండా ఆ సోఫాలో సంధ్య ఏడుస్తూ కూర్చుంది శ్రీకాంత్ లోపలికి రాలేదు ఆమెకు సమాధానం చెప్పలేదు. కొంత సేపటికి సంధ్యే వరండాలోకి వచ్చింది.

"నాకు సమాధానం చెప్పవలసిన అవసరం కూడా మీకు లేదు కదూ! ఎందుకు, ఎందుకీ నాటకం ఆడుతున్నారు. ఈ నయ వంచకుల్ని ఏంచేసినా పాపం లేదు. ఏ శిక్ష విధించినా చాలదు. నేనిక్కడ ఒక్క క్షణం కూడా వుండలేను. మొసళ్ళ చెరువులో ప్రతిక్షణం ఒక యుగంలా బ్రతకలేను నేను. పోతున్నాను. ఈ విశాల ప్రపంచంలో ఎక్కడోక్కడ హాయిగా బ్రతకవచ్చు—" సంధ్య గిరుక్కున వెనుదిరిగింది.

మెరుపులా శ్రీకాంత్ సంధ్య రెక్కపట్టుకుని బలంగా ఆపాడు. సంధ్య చురుగ్గా అతని ముఖంలోకి చూచింది. వణకుతున్న ఆ ఎర్రని పెదవులు, ఏడవటంవల్ల ఉబ్బిన పెద్దకళ్ళు—వంగిన కనుబొమలు—మధ్య జ్యోతిలా వెలుగుతున్న ఎర్రనిబొట్టు శ్రీకాంత్‌ని వెర్రివాడిని చేశాయి. మరుక్షణం ఆమెను బలంగా హృదయానికి హత్తుకుని ఆమె చెవి పక్కగా తల ఆన్చి చెప్పసాగాడు.

'సంధ్యా! నన్ను వదిలి మాత్రం వెళ్ళకు. నువ్వు ఇక్కడేవుండాలి! కావాలంటే నేను వెళ్ళిపోతాను. నీకు కనపడకుండా దూరంగా వెళ్ళి పోతాను. నిన్ను మనసారా ప్రేమించటమేనా నా నేరం! నిన్ను నా ప్రాణంగా భావించటమేనా నా దోషం! నీ పట్ల క్షణక్షణమూఆకర్షింపబడ టమే నా బలహీనత! నివ్వే శిక్షవిధించినా భరిస్తాను. కాని, ఈ ఇల్లు వదిలిమాత్రం వెళ్ళకు! సంధ్యా ప్లీజ్, కలలోకూడా ఆమాట అనవద్దు. ఊహలోకూడా ఆపని చెయ్యవద్దు. ఈ ఇంటిని నువ్వేమనుకున్నాసరే! పంజరమనుకో! ఇంకేమైనా అనుకో. నేను ఈ క్షణమే ఇల్లొదిలి వెళ్ళి పోతాను! నువ్వు ఈ ఇంట్లో ఇక్కడే వుండాలి! ఇక్కడే వుండాలి!"

సంధ్య వీపుచుట్టూ అతని చేతులు బిగుసుకున్నాయి! ఆమె మెడ మీద తన ముఖం రుద్దుకుంటున్నాడు. సంధ్య తెప్పరిల్లింది. తల్లి తన్నొదిలి వెళ్ళిపోతుందేమోనన్న భయంతో మారాం చేస్తున్న పసివాడులా వుందతనిస్థితి. ఎక్కడ పట్టు వదిలితే ఎక్కడ పారిపోతుందో అన్నట్టు గట్టిగా పట్టుకున్నాడు. అతని ఈ పిచ్చివ్యామోహం సంధ్య కర్థం కావటంలేదు.

అతని చేతుల్లోంచి ఎట్లాగో బయటపడి లోపలకు పారిపోయింది. సరాసరి తన మంచంమీదకు వెళ్ళి నిశ్శబ్దంగా ఏడుస్తూ నిస్సహాయంగా పడుకుంది. చాలాసేపటికి శ్రీకాంత్ గదిలో బెడ్ లైట్‌వేసి కిందకు వెళ్ళిపోయాడు. మధు డ్రాయింగు రూములో కూర్చుని ఏదో మాగజైను చూస్తున్నాడు. ఎదురుగా సోఫాలో మాధవి ఓరగా పడుకుని ఏదో ఆలో చిస్తున్నది. పక్కనే పసివాడు నిద్రపోతున్నాడు. నిశ్శబ్దం రాజ్యమేలుతున్న ఆ గదిలోకి శ్రీకాంత్ రాగానే మధు తలెత్తి చూశాడు. సరాసరి బయటకు

# ధర్మపథం



## తులసి విశిష్టత

వృక్షాలన్నింటిలో తులసి చెట్టు అత్యంత పవిత్రమైనది. గోవునకు ఎంత ప్రాధాన్యం ఉన్నదో, తులసికీ అంత ప్రాధాన్యం ఉన్నది. అంతకంటె ఇది ఎక్కువ అనే చెప్పవచ్చును. ప్రతి యింట్లోనూ గోవు ఉండకపోవచ్చును. కాని తులసి కోట గృహాంగణంలో లేని యిల్లు ఉండదు. ఇప్పుడు నాగరికత ఎక్కువయి, ఇళ్లలో తులసికి చోటు లేక పోతే లేకపోవచ్చును. కానీ వెనుకటి ఇండ్లలో తులసికోట ఉండి తీరేది. ఇప్పుడు కొందరు ఆ పద్ధతిని విడువనే లేదు. గృహిణులు ఉదయం స్నానం చేసి, తులసిని పూజించి, చెట్టు మొదట చెంబుడు నీళ్లు పోస్తేనేగాని, మరే పనీ ముట్టు కొనేవారు కారు.

విష్ణుదేవునికి పూలమాలకంటె తులసి మాలయే ఇష్టమైనది. పూలమాలలు లేకున్నా, తులసిమాల ఉంటే చాలు. విష్ణువునకే కాదు. శివునికి కూడా ఇది యిష్టమే. శివునికి తులసి పనికి రాదని కొందరు భ్రాంతి పడవచ్చు. కాని పంచ బిల్వాలలో తులసియే మొదటిదని అభిజ్ఞులు అంటారు.

తులసీదళపు ఘనత సాటిలేనిది. దాని విలువ యింత అని నిర్ణయించడం సాధ్యంకాదు. మన పురాణ కధలు ఈ విషయాన్ని చాటుతున్నవి. తనకు శ్రీకృష్ణుడు స్వాధీనుడని గర్వంతో ఉన్న సత్యభామ, నారదుని మాయ మాటలలో పడి శ్రీకృష్ణుణ్ణి ఆ మునికి దానం చేసింది. తిరిగి, తన భర్త తనకు లభించడానికి ఆమె ఆయన ఎత్తు ఆభరణాలను, నారదునికి ఇవ్వవలసి ఉండినది. త్రాసులో ఒకప్రక్క శ్రీకృష్ణుణ్ణి ఉంచి, మరోప్రక్క తన ఆభరణాలు ఎన్నిపెట్టినా, అవి చాలక ఇతర భార్యల నగలుతెచ్చి ఎన్నిపెట్టినా సరి తూగలేదు. చివరకు రుక్మిణీదేవి వచ్చి, ఆ నగలన్నీ తులనుండి తీసివేసి, ఒక్క తులసీదళం భక్తితో ఉంచితే సరితూగింది. అంటే—భగవంతునికి ఎంత విలువఉందో, తులసీదళానికి అంతవిలువ ఉందన్నమాట.

దేవాలయాల్లో భగవత్ప్రసాదంగా, తులసీతీర్థం, తులసీదళం ఇస్తారు. తులసీ దళాన్ని నోట్లో వేసుకోవచ్చు. మరియే దళం పనికిరాదు తులసీరసం చర్మవ్యాధు లను పోగొట్టుతుంది. వైద్యశాస్త్ర గ్రంధా లలో తులసి ఉపయోగం ఎన్నోవిధాలుగా చెప్పబడింది.

తులసి యొక్క విలువను గ్రహించి, యిండ్లలో తులసిని పెంచాలి. పవిత్రమైన తులసిమొక్కను తులసికోటలో నిలిపి పూజించి, నీళ్లు పొయ్యడం గృహస్థుల ధర్మం.

(శ్రీ హనుమత్కాళీ వరప్రసాద బాబుజీ ప్రసంగం ఆధారంగా.)

—బులుసు వేంకట రమణయ్య

## రాగసంధ్య

వెళ్తూ మధును రమ్మని సైగ చేశాడు. శ్రీకాంత్ వెనకాలే మధు బయటకు వచ్చాడు. పెద్ద పెద్ద స్తంభాలతో వున్న ఆ వరండాలో వెన్నెల ఆవరించుకుని వుంది. ఆ వెన్నెల వెలుగులో కిందగా మెట్లమీద కాళ్ళుపెట్టుకుని ఒక స్తంభానికి ఆనుకుని కూర్చున్నాడు శ్రీకాంత్. పక్కనే మధు కూడా కూర్చున్నాడు.

"నీ ప్రయాణం ఎప్పుడు!" శ్రీకాంత్ దీర్ఘంగా ఆలోచిస్తూ అన్నాడు.

"ఇంకా నిర్ణయం కాలేదు. మా మామగారికి అనారోగ్యంగా వుంది. బహుశా పైనెల మధ్యలో వుంటుందేమో! మాధవి ఒక మూడునెలలు ఆగిపోతానంటున్నది. కాని, నేను వదలి వుండలేను— రమ్మంటున్నాను!"

శ్రీకాంత్ ఆశ్చర్యంగా మధు ముఖంలోకి చూచాడు.

"మధూ! నిన్నొక ప్రశ్న అడుగుతాను! నిజం చెప్తావా!"

"అదేమిటి? కొత్తగా అడుగుతున్నావు! నీ దగ్గర నాకు రహస్యాలేమున్నయి?"

"నువ్వు త్రికరణ శుద్ధిగా నీ భార్యను ప్రేమిస్తున్నావా!"

"ఎందుకు ప్రేమించను?" ప్రశ్నకు ప్రశ్నే జవాబయింది.

"అంటే, సంధ్య నీకు జ్ఞాపకం రాదా!"

"ఎందుకు రాదు?"

"మరి?"

మధు నవ్వాడు.

"శ్రీ, ఒకప్పుడు సంధ్యను చేసుకోవాలనుకున్నాను. కాని, ఒక క్షణంలో వద్దనుకున్నాను. ఆ క్షణం నుంచీ సంధ్య, నా ప్రాణ స్నేహితుడూ — నా ప్రాణానికి ప్రాణమైన నా ఆత్మీయుడి భార్యగానే గుర్తొస్తుంది.

ఒకవేళ ఎప్పుడైనా గుర్తొస్తే ఆమెను తలచుకుని బాధపడ్తాను ఎందుకో తెలుసా, నీలాంటి ఉత్తమ వ్యక్తిని భర్తగా పొంది కూడా, మోడులా జీవితాన్ని గడుపుతున్నదని. నేనేం చెయ్యగలను చెప్పు!"

"అవును — నువ్వేం చెయ్యగలవు! సంధ్యకు ఆశలు కల్పించావు జీవితంలో భాగస్వామినవుతానన్నావు. ఏదీ, ఏ ఒక్క మాటన్నా నిలబెట్టుకున్నావా!" శ్రీకాంత్ తీవ్రంగా అన్నాడు.

మధు శ్రీకాంత్ ముఖంలోకి నిశ్చలంగా చూస్తుండి పోయాడు.

"ఇప్పుడు ఆమె నాతో గడపలేక, నిన్ను మర్చిపోలేక సతమతమవుతున్నది. ఇట్లా మండుతున్న అగ్ని ఎన్నాళ్ళు మండిస్తుంది. చివరకు ఆమెను కాల్చి మసి చేస్తుంది. అప్పుడేం చేస్తావు? నిర్దాక్షిణ్యంగా ఒక నిండు ప్రాణాన్ని బలి తీసుకున్నవాడివి కావా! మధు! ఆమెను చేసుకోక నువ్వూ, చేసుకొని నేనూ అన్యాయం చేశాం! సంధ్య జీవితం బాగుపడే మార్గమేమిటో తెలియటంలేదు!" శ్రీకాంత్ ముఖం మీద వెన్నెల పరచుకొంది. ఆ వెన్నెలలో అతని ముఖం మెరిసి పోతుంటే మంత్ర ముగ్ధుడిలా చూస్తున్నాడు మధు.

"నేనేం చెయ్యగలను! ఇందులో నా బాధ్యత ఎంతవరకు? నేను నిస్సహాయుడ్ని!" తనలో తను అనుకుంటున్నట్లన్నాడు మధు —

[ఇంకావుంది]

# నోటి దుర్వాసన పోగొట్టుకోండి. దంతక్షయాన్ని ఎదుర్కోండి.



# మీ కుటుంబంలోని వారికి కోల్గేట్ రక్షణ చక్రాన్ని ఇవ్వండి!

క్రమం తప్పకుండా కోల్గేట్ ని వాడటంతో మీ కుటుంబంలోని
వారి నోటి శ్వాస శుభ్రంగా, తాజాగా ఉంటుంది, వారి పళ్ళు యిక దృఢంగా,
ఆరోగ్యంగా ఉంటాయి. కోల్గేట్ రక్షణ చక్రం చేసేది అదే,
వారికది యివ్వడం అందుకే.

**మీరు పళ్ళు తోముకున్న ప్రతిసారీ, కోల్గేట్ యొక్క నమ్మకమైన ఫార్ములా చేసేదిది-చూడండెలాగో.**



మీ పళ్ళలో యిరుక్కుపోయిన ఆహారపు తునకల్లో దుర్వాసన, దంతక్షయం కలిగించే సూక్ష్మజీవులు పెరుగుతాయి.



కోల్గేట్ లోని అద్వితీయమైన శక్తిగల నురగ లోపలికి చొచ్చుకుపోయి, అక్కడ గల దుర్వాసన కలిగించే ఆహారపు తునకల్నీ, దంతక్షయాన్ని కలిగించే సూక్ష్మజీవుల్నీ తొలగిస్తుంది.



క్రమం తప్పకుండా కోల్గేట్ తో పళ్ళు తోముకుంటే, దాంతో యిక మీకు శుభ్రమైన, తాజా శ్వాస, దాంతోటే దృఢమైన, ఆరోగ్యమైన పళ్ళూను.

**భోజనం చేసిన తర్వాత ప్రతిసారీ మీ కుటుంబంలో వారంతా కోల్గేట్ తో పళ్ళు తోముకుంటున్నారని ధృవపరుచుకోండి నోటి దుర్వాసన పోగొట్టుకోండి. దంతక్షయాన్ని ఎదుర్కోండి. వారికి కోల్గేట్ రక్షణ చక్రాన్ని యివ్వండి.**




## దీని తాజా పిప్పరమెంట్ రుచి మీకెంతో నచ్చుతుంది!

# అపర్ణ

## కన్నెపల్లి గోపాలకృష్ణ

పెద్దగా కూతకూసి, బద్ధకంగా ఆగింది లింక్ ఎక్స్‌ప్రెస్ వాల్తేరు స్టేషన్‌లో

రాత్రి పదకొండు గంటలవేళ –

మాఘమాసమైనా చలి ఎక్కువగానే ఉంది

ట్రైనునుంచి దిగేవాళ్లతో కొలాహలంగా ఉంది ప్లాట్‌ఫారమ్ ప్లాట్‌ఫారం పైన కాలు మోపుతుంటే కళ్లల్లో నీళ్ళు గిర్రున తిరిగాయి నాకు

చల్లటి గాలి ఏదో కబురు చెప్తున్నట్లు నన్ను తాకుతూ పోతోంది

నేను నిలబడ్డ భూమిలోంచి నాలోకి ఏదో విద్యుత్తు ప్రవహిస్తున్న భావన

శరీరమంతా చిత్రమైన అనుకంపన

ఎన్నాళ్లకు నా భూమి, నాగాలి, నా భాష

పుట్టి పెరిగిన ఊరిలో ఉద్యోగం, అక్కడే జీవన పోరాటం, అక్కడే కాలం చెల్లిపోవడం చాలా తక్కువ మందికే కదా ఈ భాగ్యం

జన్మస్థలం మాట దేవు డెరుగు కనీసం స్వంత రాష్ట్రంలో మారుమూల ప్రాంతంలోనైనా ఉండ నివ్వలేదు నా దౌర్భాగ్యం

తెలుగు గాలిని పీలుస్తూ, తెలుగుభాష మాట్లాడుతూ, తెలుగు తిండి తింటూ ఓహ్! ఎంత చక్కటి భావన

పొట్ట గురించి అన్నిటికీ దూరమవ వలసి వచ్చింది

పదమూడేళ్ళుగా పరాయి రాష్ట్రంలో పని చేస్తున్నా మనసులో తెలుగుస్థానం లేశమైనా తరుగ లేదు

ఎంతసేపు ఆంధ్రా తలంపులే

అటువంటిది ఇంతకాలం ఆంధ్రా రాకుండా ఎలా ఉన్నానో?

ఆలోచిస్తూ ఎన్ని నిముషాలు నిలబడ్డానో మరి . నా భుజంపై మెత్తగా అపర్ణ చేయి

భావనలలోంచి వాస్తవంలో కి వచ్చాను

కళ్ళు మసకబారినట్లుంటే రుమాలుతో తుడుచుకున్నాను రుమాలు నిండా తడి

ఏడుస్తున్నానా??

భాధ పడుతున్నారా?" మెల్లగా అడిగింది అపర్ణ

బాధా అబ్బే ఎందుకూ? నా మాటల్లో ఎంత దాచుకుందామనుకున్నా దాగని తడబాటు

ఆమె ఏమీ మాట్లాడలేదు

నా కుడిచేతిని తన చేతిలోకి తీసుకొని గట్టిగా పట్టుకుంది

నాలో ఏ మూలో దాగి ఉన్న దైన్యం పటాపంచలయ్యింది

అవునూ? నేనెందుకు బాధపడాలి? ఏం కాని పని చేసానని? నా అపర్ణ పక్కగా ఉండగా నాకేం కొరత?

"ఎంతసేపు నాన్నా ఇక్కడ? బయటికి పోదాం' నా ఎనిమిదేళ్ల కొడుకు విసుక్కుంటున్నాడు

పోర్టరుకి సామానులు ఎత్తి బయటికి నడిచాను

గేటులో టిక్కెట్లిస్తూ టిక్కట్టు కలక్టర్‌ని అడిగాను – దగ్గరలో ఏదైనా మంచి లాడ్జి కట్టారా అని

దొండపర్తి జంక్షన్‌లో కొత్తగా మంచి హోటల్ కట్టారని చెప్పాడతను

ఆటో లో ఎక్కాం ముగ్గురమూ

ఆటోవాడు మూడు నిముషాలలో దూరాన్ని మింగేసాడు

ఆ మూడు నిముషాలూ ఆతృతగా పరికించాను సిటీని ఎంత మారింది ఊరు!

రైల్వేస్టేషనునుంచి దొండపర్తి జంక్షన్ వరకూ కేవలం రైల్వే క్వార్టర్లే ఉండేవి పూర్వం రాత్రి పది గంటల తరువాత పెద్ద జన సంచారమూ ఉండేది కాదు

ఇప్పుడో?

అటూ ఇటూ రెండు వైపులా అధునాతన భవంతులు

అంతరాత్రైనా రోడ్ల నిండుగా జనం

చక్కటి సిమ్మెంటు రోడ్లు

ఉక్కు కర్మాగారం ఇంతమార్చిందా పట్టణాన్ని!!

పదేళ్ల కాల వ్యవధిలో ఇంతగా ఎదుగుతుందా ఊరు!?

రూములో దిగి స్నానం చేసి ఫ్రెష్ అయినంత వరకూ నాతో ఏమీ మాట్లాడలేదు అపర్ణ

మా కుమార రత్నం వచ్చి రాగానే పక్కపై పడ్డాడు

స్నానంచేసి వచ్చి నా ఎదురుగా కూర్చుంది అపర్ణ

భోంచేద్దామా? అడిగాను

వద్దు ఆకలిగా లేదు మీరు చేయండి సూట్‌కేస్‌లోంచి దుప్పట్లు బయటకు తీస్తూ చెప్పింది అపర్ణ

నాకూ ఆకలిలేదు పాలు తీసుకొందాం బెల్ నొక్కి రూమ్‌బాయ్‌తో చెప్పాను పాలు తసుకు రమ్మని

పాలు తాగిన తరువాత మంచం పైన పడుకొన్నాను ఆలోచిస్తూ

బాబుని సరిగ్గా సర్ది, లైటు ఆర్పి నడుం వాల్చింది అపర్ణ

ఏవో అర్థం పర్థంలేని ఆలోచనలు నాలో

తేట తేట తెలుగులా, తెల్లవారి వెలుగులా

కలసి పాడుదాం తెలుగుపాటా

పాడనా తెలుగుపాట

ఇలా ఎన్నో పాటలు చెవుల్లో గింగురు మంటున్నాయి

మనసునిండా ఉద్వేగం

ఇంకా నిద్రపోలేదా? నా నుదిటిపైన అపర్ణ చల్లటి చేయి

నిద్ర రావడంలేదు పర్ణా ఆమె గాజులు సవరిస్తూ చెప్పాను

ఆలోచనలు మాని ప్రశాంతంగా నిదురపొండి మళ్లీ రేపు ఉదయమేకద ప్రయాణం నా జుత్తు సర్దుతూ చెప్పింది అపర్ణ

రేపే అసలైన ప్రయాణం

నా వాళ్లని, నా రక్తాన్ని కలుసుకో బోతున్నది రేపే!

నా తోడ బుట్టిన వాళ్లను, నా బంధుబలగాన్ని తిరిగి ఎంత కాలపు వియోగం తర్వాత కలుసుకో బోతున్నాను!

వాళ్ళు నన్ను చూసి ఎలా స్పందిస్తారో?

ఇద్దరన్నయ్యలూ ఎలా ఉన్నారో?

వదినల ఆరోగ్యం ఎలా ఉందో?

పిల్లల్ని గుర్తించ గలనో? లేదో?

నా మెదడులో జోరీగల్లా ఆలోచనలు

జోకొడుతున్నట్లు అపర్ణ చేయి నెమ్మదిగా నా తలను నిమురుతోంది

మెల్లగా నిద్రలో కి జారిపోసాగాను

కళ్ళు మూసుకుంటే దట్టమైన చీకటి తెరలు

ఆ తెరలపై రంగుల నా జీవితపు వెలుగులు

ఆ వెలుగుల జిలుగులలో ఎంతోమంది పాత్రధారులు

బాల్యందాటి, యవ్వనాన్ని సంతరించుకొని, తల్లిదండ్రులను కోల్పోయి, డిగ్రీ పూర్తిచేసిన నేను

చిన్నప్పటి నుంచీ నన్నెంతో ప్రేమగా చూసిన పెద్దక్కా, ఇద్దరన్నయ్యలూ, వదినలూ!

నేనంటే ప్రాణమిస్తూ, తీపి తీపి స్నేహాన్ని అందించిన స్నేహితులూ!!

నా గ్రాడ్యుయేషన్ పూర్తిచేసిన కొత్తలో సరదాగా

వెళ్ళిన ఓ కాంపిటేటివ్ ఎగ్జామ్‌లో ఉత్తీర్ణుని కావడం, ఇంటర్వ్యూ జరగడం, ఆ తర్వాత అపాయింట్‌మెంట్ రావడం నా జీవనగతినే పూర్తిగా మార్చేసింది.

నాగపూర్‌లో ఉద్యోగమనగానే హతాశుణ్ణయ్యాను.

ఎక్కడి మా వూరు? ఎక్కడి నాగపూరు??

నా వాళ్ళకి, నా భాషకి, నా గడ్డకి దూరమవుతూ ఎక్కడో పరాయి రాష్ట్రంలో ...పొట్ట కూటికోసం... ఊఁహు.



వెళ్ళడానికి నా మనసు ససేమిరా అంగీకరించ లేదు.

కానీ అప్పుడందరూ పోరారు. చెవి నిల్లు గట్టుకుని మరీ చెప్పారు.

ఈ రోజుల్లో ఉద్యోగాలు దొరకడమే దుర్లభమనీ, అందునా ఓ మంచి సంస్థలో మరింత కష్టమనీ...

మరీ అంతగా కాదనుకొంటే మధ్యలో వచ్చెయ్యమన్నారు.

కొద్దిగా సర్వీస్ చేసిన తరువాత ట్రాన్స్ఫర్ చేయించుకొని ఆంధ్రాకి వచ్చెయ్యవచ్చు నన్నారు.

ఎందరో ఎన్నో విధాల చెప్పిన పిమ్మట నేను కూడా దీర్ఘాలోచనలో పడ్డాను.

వీళ్లందరూ చెప్పినట్టు ప్రస్తుత పరిస్థితులలో ఉద్యోగాలు ఆకాశపుష్పాలే.

వచ్చిన అవకాశాన్ని ఎందుకు కాలదన్నుకోవాలి?

ఇష్టం లేకపోతే అప్పుడే మానెయ్యవచ్చు.

ఈ లోపల మరో పరీక్ష పాసైతే, ఆంధ్రాకే తిరిగి రావచ్చు.

మాతృభాషాభిమానం కూడు పెట్టదు కదా!

"గాలిలో ఉన్న రెండు పిట్టల కంటే చేతిలో ఉన్న ఒక పిట్టే విలువైనది" ఈ ఆంగ్ల సూక్తిని మననం చేసుకొంటూ వాల్తేరులో అర్ధరాత్రి పూట భారా హృదయంతో బండి ఎక్కాను నా వాళ్ళకి వీడ్కోలు చెప్తూ.

భాష రాక ముందులో ఇబ్బందులు పడ్డా నెమ్మదిగా అలవాటు పడటం నేర్చుకొన్నాను. రెండు నెలల కోసారైనా ఆంధ్రా వెళ్ళనిదే తోచేదికాదు.

జీతాన్నంతా ప్రయాణాలకే తగుల వేస్తున్నానని ఇంట్లో వాళ్ల చివాట్లు పెట్టడంతో మెల్ల మెల్లగా ఆంధ్రాకి వెళ్లడం తగ్గించాను.

* * *

నాకు క్రికెట్ అంటే విపరీతమైన పిచ్చి.

ఆడటంలో కన్నా కామెంటరీ వినడంలో నే మజా వచ్చేది.

దగ్గరలోనే తెలిసిన ఒకాయన ఇంట్లో టీవి ఉండేది. సెలవు దినాల్లో వాళ్ల ఆహ్వానంపై అక్కడికి వెళ్లి వచ్చే వాడిని.

ఆ సమయంలో పరిచయమయ్యింది అపర్ణ.

క్రికెట్‌లో ఆమెకున్న పరిజ్ఞానానికి విస్తుపోయే వాడిని నేను.

బ్యాట్స్‌మన్‌లలో ఎవరి బ్యాటింగు బాగుంటుందో, ఎవరెవరు ఏవి రికార్డులు నెలకొల్పారో, ఎటువంటి బౌలింగుకు అవతలివాడు తెలియక పడిపోతాడో ఆమె చెప్తుంటే విన ముచ్చటగా ఉండేది నాకు.

మా సంభాషణసాధారణంగా ఇంగ్లీషులోనే జరిగేది.

చక్కటి ఆంగ్ల ఉచ్చారణ ఆమెది.

అప్పుడప్పుడు ఆమె ఏవేవో ఇంగ్లీషు నవలలు తెచ్చి చదవమని ఇచ్చేది. పరభాషా సాహిత్యంపై మోజులేని నేను మొహమాటానికి అందుకొనే వాడిని కాదు.

ఆమె ఎప్పుడైనా ఆ నవలలపై చర్చించబోతే తెల్ల ముఖం వేసేవాడిని.

ఆమె ముసి ముసిగా నవ్వుతుంటే ఒంటికి కారం రాసుకొన్నట్టు ఉండేది. పట్టుదలతో ఆంగ్ల సాహిత్యాన్ని చదవడం ప్రారంభించాను.

మెల్ల మెల్లగా మా పరిచయం వృద్ధికాజొచ్చింది.

సాయంత్రాలు ఏ పేపరో, పుస్తకమో పట్టుకొని దగ్గరగా ఉన్న పార్కులోకి పోయేవాడిని నేను.

ఆమెకూడా అప్పుడప్పుడు పార్కుకొచ్చేది.

ఆమె సమక్షంలో కాలమే తెలిసేది కాదు.

ఇలా మా పరిచయానికి ఓ ఏఁడాది వయసు దాటింది.

రెండు రోజులు ఆమెని చూడక పోతే ఏమీ తోచేదికాదు.

ఏ పని చేస్తున్నా ఆమె పేరే మనసులోన!

ఎన్ని కాగితాలపై ఆమె పేరు లిఖించానో!!

దీన్నేమంటారు?

ప్రేమా?? ఏమో!!!

ఈ మధ్యలో పెళ్లి చూపుల కోసమని ఇంటికి వెళ్లడం, ఇద్దరమ్మాయిలని చూడడం జరిగింది. వాళ్లని పోల్చి సరి చూసుకొంటే ఏదో అసంతృప్తి మిగిలేది నాలో.

కాలం గడుస్తోంది

ఈ లోపల బదిలీల గురించి నేను అప్లికేషన్లు పెట్టడమూ, అవి వెనక్కి తిరిగి రావడమూ జరిగింది

ఏ పని చేయాలన్నా నిరాసక్తత

అపర్ణతో మాట్లాడాలంటే అదో విధమైన బెరుకు

నే నెంతగా అపర్ణ నుంచి తప్పించుకు పారి పోవాలని ప్రయత్నించే వాడినో ఆమె అంతగా దగ్గరయ్యేది

నా మనసులో అణచుకొందామన్నా అణగని అలజడి ఆమె సుముఖంలో ఈ భావాలు నా ముఖంలో ప్రస్ఫుటిత మవుతున్నాయా? ఆమె ఇవన్నీ గుర్తించి కూడా గుర్తించనట్లు నటిస్తోందో? ఏమో?

సెప్టెంబరు చివరి రోజులు

వర్షాకాలపు ముగింపుకు, చలికాలపు ప్రారంభానికి సంధి రోజులు ..

పార్కులో ఓ మూల కూర్చుని, ఏదో ఆలో చిస్తున్నాను

"ఏమిటో అంత దీర్ఘాలోచన?" నా కళ్లల్లోకి చూస్తూ ఇంగ్లీషులో అడిగింది అపర్ణ, ఎప్పు డొచ్చి నా పక్కన కూర్చుందో, ఏమో?

ఆమెని చూస్తుంటే తిరిగి అదే కలవరం మదిలో

"ఈ మధ్య ఏమిటో చాలా పరాకుగా ఉంటు న్నారు మీరు బాధలు స్నేహితులతోనూ, ఆనందాన్ని చుట్టాలతోనూ పంచుకోవాలంటారు నాతో కూడా చెప్ప రానిదా విషయం?" లాలనగా అడిగిందామె

ఆమె ఆప్యాయతకు మతి పోతోంది

ఇక భరించలేను

ఒక్క ఉదుటున ఆమె చేయి నా చేతుల్లోకి తీసుకుని ఆవేశంగా చెప్పాను "ఐ లవ్యూ పర్ణా"

ఆమె ముఖం సంతోషంతో మెరిసింది

ఐటూ" మృదువుగా చెప్పింది చేతులు విడి పించుకొంటూ 'ఈ మాట చెప్పడానికా ఇంత మధన పడ్డారు" నవ్వింది

ఒకరి మనసులు ఒకరికి విప్పి చెప్పుకొన్నాం

# అపర్ణ

మా పెళ్లి ముహూర్తం మేమే నిశ్చయించు కొన్నాము

ఇలా అపర్ణని పెళ్లి చేసుకుంటున్నానని మా వాళ్లకి తెలియ జేయడం,వాళ్లొచ్చి మండి పడటమూ జరిగింది ఎన్నో విధాల నచ్చచెప్ప చూసారు కానీ నా పట్టుదల సడలలేదు అపర్ణ వాళ్ల ఇంట్లో కూడా అపర్ణకు తీవ్ర ప్రతిఘటన ఎదురయ్యింది

మేమిద్దరం ఓ మంచి రోజు చూసుకుని రిజిస్ట్రార్ ఆఫీసులో గప్‌చిప్‌గా పెళ్లి చేసుకొన్నాం

మా ఆఫీసులోనూ, లొకాలిటీలోనూ ఈ విష యాన్ని కొన్నాళ్లు విచిత్రంగా చెప్పుకొన్నారు కానీ ఆ తర్వాత పాతబడి ఊరుకున్నారు

మా ప్రేమ ఫలానికి నిదర్శనంగా రెండేళ్లలో చక్కటి బాబు

*  *  *

పెళ్లయిన ఏడాది తరువాత ఇంటికి వెళ్దామని బుద్ధి పుట్టింది

మా వాళ్ళు హృదయ పూర్వకంగా ఆహ్వానిస్తారనే అనిపించింది నేను వాళ్ల ప్రమేయం లేకుండా పరాయి రాష్ట్రపు అమ్మాయిని పెళ్లి చేసుకోవడం వలన వాళ్లకి కినుక రావడం సహజం కాలం అన్ని గాయాలనూ మాన్పినట్లే వాళ్ల మనసులనీ సమా ధాన పరచకపోలేదు

నా ప్రపోజల్‌ని అపర్ణ కూడా సంతోషంగా ఆమోదించింది

నా వాళ్లని ఎన్నడూ చూడక పోయినా వాళ్ల గురించి అంతా తెలుసు ఆమెకు తీరిక దొరికి నప్పుడల్లా నా బాల్యం గురించి, చుట్టపక్కాల గురించి, నా కాలేజీ రోజుల గురించి అడిగి శ్రద్ధగా వినేది

ఆఫీసుకు పదిహేను రోజుల సెలవు పెట్టి ఇద్దరమూ పెద్దన్న ఇంటికి చేరుకున్నాము మా వాళ్లందరూ మా చిన్ని కొడుకు పెళ్లికి వెళ్లినట్లు తెలిసింది

మరీ సంతోష మనిపించింది నాకు

ఎంత అదృష్టం

ఒకే సమయంలో అందరినీ కలియడమే కాక,అప ర్ణని కూడా అందరికీ చూపి నా ఎంపికకు మన్నన లందుకోవచ్చు

మన భాష చదవకపోతేనేమి గాక, ఆ అణకువా, కలగొలుపుతనమూ మా వాళ్లని సంతృప్తి పరచదూ!

కానీ

నా ఊహలకు భిన్నంగా–

ఎంతో సరదాగా వెళ్లిన మాకు తీవ్ర నిర్లక్ష్యమే ఎదురయ్యింది

నా వాళ్లందరూ నన్ను ముందు నిష్ఠూరాలాడినా ఆప్యాయతాభిమానాలతో ముంచెత్తారు

అపర్ణని ఎవ్వరూ పట్టించుకోలేదు ప్రతి ఒక్కరూ ఆమెని చూసి ఇంకొకరితో గుస గుసలు పోయేవారే వదినలు కూడా అపర్ణతో మాట్లాడ లేదు

అదీగాక భాషకూడా పెద్ద ప్రతిబంధకమాయె

అపర్ణకా తెలుగురాదు వాళ్లకా ఇంగ్లీషు అంతగా రాదు

ఈ పరిస్థితి అపర్ణకెలా ఉన్నా నాకు మాత్రం మహా దుర్భరంగా ఉంది ఒక వంక నన్ను వాళ్లలో కలుపుకొంటూ ఆమెని ఆమడ దూరంలో ఉంచడం ఎలా సహించ గలదు నా మనస్సు?

ఆమె ఏ పనిలో కల్పించుకో బోయినా ఏదో వంక చెప్పి వారించేవాళ్లు

ఎవరూ మాట్లాడక ఏమీ తోచక నలుగురిలోనూ ఉన్న నాతో కల్పించుకొని మాట్లాడలేక బిక్కు బిక్కుమంటూ ఓ మూల కూర్చునివున్న ఆమెని చూస్తే మనసు తరుక్కు పోయింది

పెళ్లయిన వెంటనే బయలుదేరి పోయాను మా వాళ్లెంత వారిస్తున్నా వినకుండా మరో నాలుగు






# వసంతంలో శిశిరం

ఇంటి ముందున్న రావిచెట్టు
ఏటేటా శిశిరంలో పూర్తిగా
ఆకు రాల్చడం, వసంతం రాగానే
అందమైన చిగురు పెట్టడం పరిపాటి.

క్రోధన కోధానలో ష్మానికి
బాధా తప్త దళిత పత్రాలు
వసంతంలో కూడా రోదిస్తూ
పస చెడి రాలుతూనే ఉన్నాయి.
కాల గమనాని కంతరాయం
కలిగిస్తున్నాడా మనిషి?

★ ★ ★

తను సృజించిన రేడియో ధార్మికత
అనుక్షణ విస్ఫోటంతో
వాతావరణ రచనను
పరి పరి విధాల మారుస్తూంటే;
పరిశ్రమల కాలుష్యం
పరిణామ క్రమాన్ని శతధా
వక్రింప చేస్తూంటే;
అడవులు పడగొట్టి
అనాదిగా ప్రకృతిలో సాగే
జీవ వృక్ష పారస్పర్యాన్ని
చెడ గొట్టి, జీవాను కూల్యతకు
కడగండ్లు కలిగిస్తూంటే;
రసాయన ఎరువులతో
కసాయి వాని వలె
భూమాత కడుపులో
ప్రొద్దల్లా చిచ్చు పెడుతూంటే;
వసంతంలో శిశిరం రాదా?

★ ★ ★

కాలచక్ర పరిభ్రమణ వేగం
ప్రాలుమాలి మందగిస్తూంది,
వసంతోదయం ఆలస్యమై,
వసంత సమయంలో శిశిర మనిపించినా
శిశిరాన్ని తరిమే వసంతం
శశి కాంతులతో
పసిడి పూతలతో
కోయిల పాటలతో
మత్తుగా మైమరపిస్తూ
వస్తుంది,
ఉగాది పచ్చడి తినిపిస్తుంది.

వసంతరావు వేంకటరావు

# అపర్ణ

రోజులుందామని అపర్ణ బ్రతిమాలినా వినలేదు నేను

నాగపూర్ చేరిన దాది అపర్ణ పట్టుపట్టి తీవ్రంగా తెలుగు నేర్చుకోవడం ప్రారంభించింది

నేను ఎంతో బలవంతం చేయగా కారణం చెప్పింది– తనకు తెలుగు భాష రాకపోవడం వలన అందరితో కలివిడిగా ఉండలేక పోయానని. తనతో మాట్లాడడానికి ప్రతి ఒక్కరూ ఇబ్బంది పడ్డారని. అదీగాక భర్త తెలుగువాడైనందు వలన తెలుగు ఇల్లాలుగా మారడం తన ధర్మమనీ, తెలుగు భాష నేర్చుకోవడం తన కర్తవ్యమనీ!

రెండు నెలలలో చందమామ చదవడం వరకూ వచ్చింది ఆమె చదువు

మరి కొద్ది నెలలలో నే తెలుగు భాషలో ప్రావీణ్యత సంపాదించింది అపర్ణ

నేను వ్రాసే కథలను శ్రద్ధగా ఫెయిర్ చెయ్యడమే గాక వాటిపై చక్కటి విమర్శలు చేసేది నాతో తెలుగులో తప్ప మరో భాషలో మాట్లాడేది కాదు తెలుగు పండుగలూ, ఆచారాలు తూచ తప్పక పాటిస్తుంది ఇన్ని మాట లెందుకు? నూటికి నూరుపాళ్ళు తెలుగు వనితగా మారిపోయింది అపర్ణ

నా అన్నలు ఉత్తరాలు వ్రాస్తూనే ఉన్నారు నేనూ సమాధానాలిస్తూనే ఉన్నాను ఈ పదేళ్ళలో వాళ్ళెన్నో సార్లు ఆహ్వానించారు ఇంటికి రమ్మంటూ మళ్ళీ ఏ అవమానా లెదుర్కోవలసి వస్తుందో అని నేనే వెళ్ళలేదు

కూతురి పెళ్ళికి తప్పక రమ్మంటూ బ్రతిమాలుతూ ఉత్తరం వ్రాసాడు పెద్దన్న శుభలేఖ పంపుతూ

నేను సంశయించినా బంధుత్వాలు తెంపుకోరాదనే అపర్ణ బలవంతం పైన తప్పని సరిగా బయలు దేరవలసి వచ్చింది

నాతో పాటు తనూ బయలుదేరింది నా వాళ్ళు ఆమెని మళ్ళీ పూర్వంలా చులకనగా చూస్తే భరించ గలనా??

* * *

శ్రీకాకుళంలో బస్సు దిగిన తరువాత ఎందుకైనా మంచిదనే ఉద్దేశంతో నేరుగా ఇంటికి పోకలాడ్జిలో రూము తీసుకున్నాను

స్నాన పానాదులు పూర్తి చేసుకుని బయలు దేరాం నేనూ, అపర్ణా, బాబూ

పెళ్ళి పందిరికి దగ్గరవుతున్న కొద్దీ టెన్షన్ పెరిగి పోసాగింది

మమ్మల్ని మా వాళ్ళు ఎలా రిసివ్ చేసుకొంటారో?

పూర్వంలా వెలివేసినట్లుగానే చూస్తారా? లేక వాళ్ళలో కలుపుకొంటారా?

లోపలికి వెళ్ళాం

పెళ్ళి మర్నాడు జరగనున్నందు వలనేమో అసలైన సందడి ఇంకా మొదలు కాలేదు

వసారాలో కుర్చీలలో కూర్చుని కొంత మంది బాతాఖానీ వేస్తున్నారు

నన్ను చూడగానే ఒక్క ఉదుటున లేచి, కౌగ లించుకున్నాడు అన్నయ్య

ఇన్నాళ్ళకు గుర్తు కొచ్చామా మేం?' నిష్ఠూర మాడాడు

నా వెనుక మౌనంగా అపర్ణ దిక్కులు చూస్తూ బాబు

అన్నయ్యతో ఏదో పనిపడి కాబోలు వదిన వచ్చింది

"వదినా" పలకరించాను

"బాగున్నావయ్యా? ఎన్నాళ్ళకు ఆనందంగా వదిన

నా కొడుకుని దగ్గరకు తీసుకొని ముద్దు పెట్టు కొంది

ఇంతలో మిగిలిన రక్త సంబంధీకులందరూ వచ్చి చేరారు.

అక్కా, బావ, పిన్నీ, మామ, బాబాయి, పిల్లలూ

అందరూ నా చుట్టూ చేరి ప్రశ్నల వర్షం కురిపించే వాళ్ళే.

ఒక్కరు కూడా నిరాదరణగా మాట్లాడలేదు

లాడ్జిలో దిగానని చెప్తే బాధ పడ్డారందరూ చివాట్లు పెట్టారు

కబుర్లలో గంటసేపు ఇట్టే గడిచి పోయింది ఎన్ని కబుర్లు చెప్పుకున్నా ఇంకా చెప్పవలసినవెన్నో మిగిలి పోతున్నాయి

హఠాత్తుగా గుర్తుకొచ్చింది అపర్ణ

అరే, వీళ్ళని చూసిన ఆనందంలో తనని మరచిపోయానని, నేను నిర్లక్ష్యం చేసానని బాధ పడదు కద పూర్వంలాగే వీళ్ల అనాదరణ వలన వాళ్ళతో కలవలేక ఒంటరిగా కూర్చోలేదు కద

ఆమె కోసం చుట్టూ వెతికినాయి నా కళ్ళు

ఇంతలో మా వాడు లోపల నుంచి వచ్చాడు లడ్డూ తింటూ

నానా, దొడ్డమ్మలు రమ్మంటున్నారు చెప్పేసి తోటి పిల్లలతో ఆడుకోడానికి వెళ్ళి పోయాడు

లోన గదిలోక వెళ్ళాను

ఏమూలో కుర్చీలో బెరుకుగా కూర్చుంటుం దనుకున్న అపర్ణ మా వదినల పక్కన కూరలు తరుగుతూ– ఏవో కబుర్లు చెప్పుకుంటూ నవ్వేసు కుంటున్నారు తోడికోళ్ళు

నేనూ చాపపై చతికలబడ్డాను

ఏమయ్యా మరిది! ఇన్నాళ్ళు మా చెల్లిలిని చూపకుండానే దాచేస్తావా? నా ముందు ఫలహారం పెడుతూ అడిగింది చిన్న వదిన

మాటల్లో పడ్డాం అందరమూ

నా చిన్నతనం గురించి, నా ఇష్టాల గురించి, నా కపల గురించి సాగిపోతున్నాయి కబుర్లు

ఎన్నో ఏళ్ల నుంచి పరిచయం ఉన్న దానిలా వాళ్లలో కలిసి పోయి వదినలతో పాటు అప్పుడప్పుడూ నామీద విసుర్లు విసురూ్త అపర్ణ-

ఆనందంతో కళ్ళు చెమ్మగిల్లాయి మరోసారి

*　　　*　　　*　　　*

వాలు కుర్చీలో విశ్రాంతిగా చేరగిలబడి పేపరు చూస్తున్నాను

పెళ్లి నుంచి పది రోజుల క్రిందటే వచ్చాం మేము

ఆ జ్ఞాపకాలు ఇంకా మరుగున పడలేదు

నాకో టీ కప్పు అందించి తనూ ఓ టీ కప్పుతో పక్కనే కుర్చీలో కూర్చుంది అపర్ణ

సంధ్యాకాంతిలో మెరిసిపోతున్న ఆమె ముఖం చూస్తుంటే తమకం ఆవరించింది నన్ను ఆమె చేయి పట్టుకొని దగ్గరకు తీసుకున్నాను నున్నటి మెడపై నా అధరాలు ప్రాకుతుంటే గుర్తుకొచ్చింది ఎర్రరాళ్ల నెక్లెస్

అవునూ ఈమధ్య నెక్లెస్ పెట్టుకోవడం మానేసావేం? మంగళ సూత్రంతో ఆడుకొంటూ అడిగాను

కొద్దిగా దూరం జరిగి, నేల చూపులు చూస్తూ చెప్పింది అపర్ణ

చెప్పడమే మరచి పోయాను ఆ రోజు ముహూర్తం వేళకి విపరీతమైన తలపోటుతో పై గదిలో పడుకున్నారు మీరు సరిగ్గా కన్యాదానం సమయానికి నెక్లెస్ కావాలని పేచీ పెట్టాడు పెళ్లి కొడుకు తండ్రి వాళ్ల ముందే చెప్పారట కానీ సొమ్ము సర్దుబాటు కాక కొనలేదు బావగారు సర్ది చెప్పవచ్చులే అన్న ఉద్దేశంతో ఉన్నారాయన ఆయన ఎంతో బ్రతిమాలినా వినలేదు మగ పెళ్లి వారు నెక్లెస్ అప్పటి కప్పుడే కావాలని, లేకపోతే దాని బదులు ఓ అయిదువేలన్నా కావాలని మంకుపట్టు పట్టాడాయన ఎంతమంది పెద్దలు చెప్పినా వినిపించుకోలేదు పంతాలు, పట్టుదలు పెరిగి పోసాయి పెళ్లి ఆగిపోయే ప్రమాదం ఏర్పడింది ఓ ఆడ పిల్ల జీవితం- అందునా మన అమ్మాయి జీవితం నా దగ్గరున్న నెక్లెస్‌ను ఎప్పుడో తప్ప వాడడం లేదుకదా నేను అది నా దగ్గర నిరుపయోగంగా పడి ఉండడం కన్నా ఓ ఆడపిల్ల జీవితాన్ని నిలబెట్ట గలిగితే అంతకన్నా కావలసిన దేమున్నది? మరేమీ ఆలోచించలేదు నేను నెక్లెస్ బావగారి చేతిలో పెట్టాను. దాన్ని తీసుకోడానికి ఆయన ఓ పట్టాన ఒప్పుకోలేదు మమ్మల్ని ఇంకా వేరుగా చూస్తున్నారా అని నిష్ఠురమాడితే తప్పని సరిగా తీసుకున్నారు ఆ నెక్లెస్ పట్టుకొని కళ కళలాడుతున్న ముఖంతో నావైపెలా చూసిందో తెలుసా సీత? అబ్బ ఇప్పటికి ఆ చూపు మరచి పోలేను"

కొన్ని క్షణాలు తరువాత మెల్లగా నావద్ద కొచ్చింది అపర్ణ

భుజంపై చేయేస్తూ అంది "మిమ్మల్ని అడక్కుండా చేసినందుకు కోప మొచ్చిందా? క్షమించరూ" బేలగా అంది

ఆ ఎర్ర రాళ్ల నెక్లెస్ అంటే అపర్ణకు ఎంత ప్రాణమో నాకు తెలుసు ఆమె తల్లి చనిపోతూ అపర్ణకు ఇచ్చిన చివరికానుకది ఓ సారి అవసరం పడి, ఆ నెక్లెస్ తాకట్టు పెడదామని అడిగితే నాతో తగవు వేసుకొంది గానీ నెక్లెస్ ఇవ్వలేదు జీవితంలో అదే మొదటిసారి, చివరిసారి కూడా ఆమె నాతో జగడమాడటం రోజూ సాయంత్రం ఓ గంటైనా ధరించనిదే తోచదామెకు

అటువంటి ప్రాణప్రదమైన నెక్లెస్‌ను ఓ ఆడ పిల్ల పెళ్లి నిలబెట్టే ఉద్దేశ్యంతో, అదీనా అన్న కూతురి కోసం త్యాగం చేసింది అపర్ణ.

ఇంతకు ముందు మావాళ్ళుచేసిన అవమానాన్ని కూడా పక్కకు నెట్టి, వాళ్ల కోసం ముందుకొచ్చి నిలబడింది అపర్ణ

మాతృభాష వదిలి, పరాయి భాష నేర్చి, నా మీద నమ్మకంతో ప్రేమతో నా కోసం తన సర్వస్వం ధారపోస్తూ, నాలో కలిసి పోయిన నా అపర్ణా...

ఏ తప్పు చేసావని నిన్ను క్షమించగలను?

ఆర్తిగా హృదయానికి హత్తుకున్నాను ఆమెని □

# సుభాషితాలు

క్షణశః కణశశ్చైవ విద్యామర్థంచ
సాధయేత్
క్షణత్యాగేకుతో విద్యా కణత్యాగేకుతో
ధనమ్.

గృహీత ఇవ కే శేషు
మృత్యు నా ధర్మ మాచరేత్.
ముసలితనం, మరణం మనకు లేదని
తలచి విద్యార్జనను ధనార్జనను చేయాలి.




క్షణం వ్యర్థం చేయకుండా విద్యార్జన చేయాలి. కొద్ది కొద్దిగానే ధనాన్ని ప్రోగు చేయాలి. క్షణం వ్యర్థంగా గడిచినా విద్యార్జన నిలిచి పోయినట్లే. కొద్ది ధనమే గదా అని అలక్ష్యం చేస్తే ధనార్జన ఆగిపోయినట్లే. (దీక్షతో చదవాలి, పూనికతో ధనాన్ని సంపాదించాలి అని భావము)

అజరామరవత్ ప్రాజ్ఞః
విద్యా మర్థం చ సాధయేత్.




మృత్యువు చేతిలో తన జుత్తు చిక్కుకుందని తలచి వెంటనే ధర్మకార్యాన్ని చేయాలి.

(మనం శాశ్వతంగా వుంటామని తలచి విద్యార్జన ధనార్జన చేయాలి. మనలను యముడు లాక్కొ పోతున్నట్లు తలచి (రేపు ఉండముగాన) వెంటనే దాన ధర్మాలను చేయాలి అని భావము)

–ఆయుర్వేద శిరోమణి రాజరాజేశ్వరశర్మ









### పి. ఏ. ఆర్. – పాకాల

★ నాకు సుమారు 6 నెలలుగా తొడల ప్రక్కన చిడుములు లాగా బిళ్లలు బిళ్లలుగా ఏర్పడుచున్నవి ఏదైనా ఆయింటుమెంటు పూసినచో 2 రోజులు బాగా వుండి మరలా వచ్చుచున్నవి

● పై పూతగా మిల్లికార్టెన్ వయోఫాం, లోనికి ఫల్విన్–ఎం పూటకి రెండు మాత్రల వంతున రోజుకి మూడు పూటలుగా వరుసగా 20 రోజులు మాత్రలు వాడండి

### యం. పి. కె. – అనంతపురం

★ ఎత్తు పెరగటానికి థైరక్సిన్ ఇంజక్షన్ చేస్తారట నిజమేనా? అది ఎక్కడ చేస్తారు?

● శుద్ధ అబద్ధం ఎక్కడా ఈ ఇంజక్షన్ దీనికగాను చెయ్యరు

### వి వి ఆర్ - అనంతపురం

★ నా వయస్సు 19 ఏండ్లు నాకు హ్రస్వ దృష్టి–8 వున్నది ఆపరేషన్ చేయించుకుంటే కనీసం సగమయినా తగ్గుతుందా? ఆపరేషన్ ఎక్కడ చేస్తారు? ఎక్సర్‌సైజు వలన తగ్గించే చికిత్సాలయాలు వున్నాయా?

● హ్రస్వ దృష్టికి ఆపరేషన్ ఎవరు చేస్తామన్నారు? కళ్లజోడు గాని, కాన్‌టాక్ట్ లెన్సులను గాని వాడవలసి ఉంటుంది కంటికి ఎక్సర్‌సైజు మంచిదని తోస్తే నేత్ర వైద్యులే దానిని సూచించటం జరుగుతుంది

### టి. కె. – కరీంనగర్

★ నాకు నడుము నొప్పి తలనొప్పి మోకాళ్ల నొప్పులు వున్నవి జీర్ణశక్తి వుంది కానీ మలవిసర్జన సక్రమంగా వుండదు గట్టిగా చిన్న చిన్న ముద్దలుగా వస్తుంది కడుపులో మంట, నొప్పి వస్తూ వుంటుంది

● మలబద్ధకం వల్ల పై లక్షణాలన్నీ ఏర్పడే అవకాశం ఉంది ఆహారంలో ఆకు కూరలు ఎక్కువగా వాడవలసి ఉంటుంది నీరు అధికంగా త్రాగాలి శరీర వ్యాయామం, పాలు పండ్లు అధికంగా వాడటం మొదలయిన వాటివల్ల పై లక్షణాలన్నీ తగ్గిపోతాయి

### వి. యస్. – సిద్ధారం

★ నా వయస్సు 18 సంవత్సరములు స్వీటు తింటే పండ్లు తీపులు వస్తున్నవి పళ్ళు నిత్యం ఉప్పుతో తోముకుంటాను స్నానం చేసేటప్పుడు లక్స్ సోపుతో తోముకుంటాను

● ఇలా మరీ విపరీతంగా దంత ధావన అనవసరం మామూలుగా ఆహారం తీసుకొన్న తరువాత పేస్టుతో దంతదావన చేస్తే చాలు

### డి. కె. ఆర్. – తుని

★ నాకు 5 ఏళ్ల నుంచి కాళ్ళు పగులుచున్నవి నడిచేటప్పుడు మండటం వలన నడక తేడాగా వుంటోంది ఈ పగుళ్ళు తగ్గటానికి ఏ మందులు వాడాలి?

● పై పూతగా సాలిసిలిక్ యాసిడ్ ఆయింట్‌మెంట్ వాడి చూడండి. ☐



## "చౌకలో లభించే కలర్ టివి కొని నేను కొంత సొమ్ము సందేహం లేకుండా ఆదా చేసుకోవచ్చు. కాని అది పనిచేయడానికి నేను చాలా ఖర్చుపెట్టాలా?"

వృత్తిరీత్యా బ్యాంకర్ అయిన శ్రీ కే.ఆత్మనాథన్ 'టెలివిజన్ మీద వ్యయం' చేయడానికి ఎదురుచూశాడు. దయనోరాలో అతనికి ప్రయోజనం కనిపించింది.



శ్రీ కే. ఆత్మనాథన్ చౌకలో లభించే కలర్ టివి కొనడానికి హుటాహుటీన బయటకు వెళ్ళలేదు. అతను తన వ్యయంమీద సంవత్సరాల తరబడి సరియైన కాలక్షేపం యిచ్చే దాని కోసం ఎదురుచూశాడు. దయనోరాలో అతనికి ప్రయోజనం కనిపించింది.

అతను దయనోరా CT 212 Mark I కలర్ టివిని ఎంచుకోడానికి అందులో ఆటో-డిగాస్సింగ్ యూనిట్, ఆటోమాటిక్ ఫైన్ ట్యూనర్ మరియు తాకిన వెంటనే పనిచేసే కంట్రోల్స్ వంటి విశిష్టమైన ఎలక్ట్రానిక్ సంవిధానాలు వుండడం కారణం కాదు. అందుకు అసలు కారణం పెద్దదయినా, చిన్నదయినా ప్రతి అంశం నాణ్యత గురించి అంచనా వేయగలనని అతనికి తెలిసి వుండడమే.

దయనోరా నాణ్యతా చిహ్నమే తన టివి తన నమ్మకాన్ని ఎన్నడూ వమ్ముచేయదనే శ్రీ కే. ఆత్మనాథన్ తిరుగులేని అభిప్రాయానికి కారణం.

Dyanora®

# దయనోరా® కలర్




అత్యుత్తమమైనది ఆశించేవారికి

DYN-1651

# ప్రేమించవే మనసా......

## అద్దేపల్లి సుచిత్రాదేవి

[గత సంచిక తరువాయి]

శివశంకరంగారు భార్యతో కలిసి వెళ్ళి శ్రీనాథ్‌తో అన్ని విషయాలు సంప్రదించి ముహూర్తం పెట్టించుకుని వచ్చారు. శ్రీనాథ్ మనసులో వున్న ప్రశ్నలు, అనుమానాలు శివశంకరంగారు తమ మాటల చాతుర్యంతో తీర్చివేసారు.

"శిల్పకు పూర్తి అంగీకారమేనా ?" అని అడిగిన దానికి అతనితో.

"మనస్ఫూర్తిగా యిష్టం !" అని కచ్చితంగా చెప్పారు.

ఎంత త్వరగా ఆ మూడుముళ్ళు పడితే అంత మంచిదన్న ఉద్దేశంతో వీలైనంత దగ్గరలో ముహూర్తం పెట్టించారు. వారం రోజులకే ముహూర్తం కుదిరింది. ఈ పెళ్ళి కుదరటం, అంత త్వరలో వివాహం అంతా కలలో జరుగుతున్నట్లుంది అందరికి డబ్బు సర్దుబాటులో లేని వారికయితే పెళ్ళి దగ్గర పడుతుందంటే కంగారు పడాలి కానీ చేతి వేళ్ళమధ్య సిరిదేవి నాట్యమాడే వారికి ఏం యిబ్బంది ? కావాలనుకుంటే అంగరంగ వైభవంగా మరుసటి రోజే పెళ్ళి జరిపించెయ్యగలరు.

అయినా పెళ్ళి పనులన్నీ వేగంగా, నిరాటంకంగా జరిగిపోతున్నా భువనేశ్వరికి ఒకటే కంగారు, హడావుడిగా వుంది.

శ్రీనాథ్ కి తల్లి తండ్రి పోయారు. అన్నా వదినలే అతని వైపు పెద్దలు. వారితో అయినా ఆస్తి పంపకాలు చేసుకుని వచ్చేసాక అంత సత్సంబందాలు లేవు. తాము గ్రామంలోనే ఒక సంబంధం చూపితే శ్రీనాథ్ వద్దన్నాడని వారికి మనసులో కోపం వుంది

**జరిగిన కథ-8 :** భువనేశ్వరి, శివశంకరగార్ల కూతురు శిల్ప ప్రేమించిన శ్యామ్ దూరమవడంతో ఆమె బ్రతుకే చీకటయి పోయింది. ఆమెను ఆ దిగులు నుంచి మరిపించేటందుకు సస్య శిల్పను తమింటికి తీసుకెళ్ళింది. విజ్జూ, సస్య, శిల్ప,సంజయ్, రజియా కలిసి యాదగిరి గుట్టకు వెళ్ళివచ్చారు. మరునాడు ఇప్పుడే వస్తానని చెప్పి వెళ్లిన శిల్ప మధ్యాహ్నం అయినా ఇంటికి రాలేదు. శిల్ప గండిపేటకు వెళ్లి ఉంటుందని ఊహించి వెళ్లిన విజ్జూ, సస్యలకు రౌడీలు వెంబడిస్తుంటే పరుగెత్తుకొస్తున్న శిల్ప కనబడింది. నిస్త్రాణగా పడిపోయిన శిల్పను ఇంటికి తీసుకు వచ్చారు విజ్జూ, సస్య. పెళ్లి చేస్తే శిల్ప మనసు కుదుట పడుతుందని సస్య తండ్రితో అంటారు శివశంకరం గారు. ప్రకాష్ మనసులో సస్య తననసలు ప్రేమిస్తూందా? అనే ప్రశ్న ఉదయించింది. ప్రకాష్‌లో మార్పు సస్య పసిగట్టింది. శివశంకరం గారు శిల్పకు పెళ్లికొడుకుగా ఒక అబ్బాయిని చూసారు. అతని పేరు శ్రీనాథ్. మొదట శిల్ప వివాహానికి నిరాకరించినా తుదకు అంగీకరించింది.

అందుకే మగ పెళ్ళి వారిగా ఏమీ పెత్తనాలు కల్పించుకోక చూడవచ్చిన బందువుల్లా పెళ్ళినాటికే వస్తామన్నారు. వాళ్ళ మనస్తత్వం ఎరిగున్నదే కాబట్టి శ్రీనాథ్‌కూడా అంతగా పట్టించుకోలేదు. తనవారినుంచి స్వార్థము, అసూయ తప్ప అనురాగాన్ని అతనెప్పుడూ చవిచూడలేదు. ప్రాణ స్నేహితుడు బానుతేజ, అతనితల్లి శ్రీదేవమ్మే తనకు ఆప్తులు అని అనుకున్నాడు. ఆవిడే అతనికి అన్ని సలహాల నివ్వసాగారు అతని తరపు పెద్ద దిక్కుగా.

ఆరోజు పెళ్ళికూతురికి మగ పెళ్ళివారు యివ్వాల్సిన బట్టల సెలక్షన్‌కు శిల్పనే స్వయంగా షాపుకి తీసుకెళ్ళి తానిష్టపడిన చీరలను తీసివ్వమని చెప్పారు ఆమె.

శ్రీనాథ్ శిల్పకోసం కారు తీసుకు వచ్చాడు.

శిల్పకి యీ తంతులన్నీ అసహ్యంగా అనిపించించిది.

"ఏవో ఓ చీరలు ! మమ్మీ నువ్వెళ్ళి సెలక్టు చెయ్యి అంతగా అయితే ! అన్నది భువనేశ్వరితో.

అక్కడేవున్న శివశంకరంగారు ఆమాటలకి శిల్పవైపు చూస్తూ నెమ్మదిగా అన్నారు.

"శిల్పా, యీ పెళ్ళి నిన్నడిగే నీ యిష్టం తెలియజేసిన మీదటే జరిపిస్తున్నాను. పెళ్ళి అంటే కేవలం అతని చేత మెడలో మాంగల్యం కట్టించుకోవటమేకాదు నువ్వు అతనితో జీవితాంతం కలిసి మెలిసి వుండాలి. ఆ అబ్బాయెంతో ఉత్సాహంగా వచ్చాడు. నిరాశపర్చకు. పెళ్ళికి కొనే ప్రతి చిన్న వస్తువూ, జరిగే అతి చిన్న సంఘటనా జీవితాంతము గుర్తుండిపోతాయి!"

"శ్రీనాథ్ ఎదురు చూస్తున్నాడు. త్వరగా వెళ్ళమ్మా" అన్నారు అనునయంగా

"మనసు శామ్‌తోనే చచ్చిపోయింది కదా. ఈ శరీరం ఒక బొమ్మ అని పెళ్ళికి ఒప్పుకుంది కానీ మనసున్నా లేకపోయినా శరీరానికి కొన్ని యిష్టాలు, అయిష్టాలు మిగిలివుంటాయి. వాటి అలజడికి ఎదురు తిరిగి జీవించటము అనుకున్నంత సులభం కాదేమో" అనుకుంది శిల్ప. శిల్ప మరి ఆలోచించుకునే అవకాశం లేకుండా భర్త కనుసైగ నందుకుని భువనేశ్వరి కూతురి చెయి పట్టుకుని కిందకు తీసుకొచ్చేసింది.

తలవంచుకుని తల్లి చేయిపట్టుకుని వస్తున్న శిల్పని చూసి శ్రీనాథ్ చిన్నగా నవ్వుకున్నాడు.

"ఎమ్. ఏ చదువుతున్న, సిటీలో పెరిగిన యీ కాలం ఆడపిల్లేనా యీ అమ్మాయి ? మరీ యింత బేలతనమా !" అనుకున్నాడు మనసులో. తన పక్కన బొమ్మలాగ కూచునివున్న శిల్పని చూస్తూ కారు ఆ రోడ్డు మలుపు తిరిగిన తర్వాత మెల్లగా అన్నాడు శ్రీనాథ్.

"నాకు నిశబ్దం యిష్టమే కానీ మరీ యింత మౌనాన్ని భరించ లేను !"

శిల్ప పెదవి విప్పలేదు, కనులిటు తిప్పలేదు.

ఓరగా ఆమెవైపు చూసాడు శ్రీనాథ్.

ఆ నిర్లిప్త వైఖరి మళ్ళీ అతనిలో అనుమానం రేకెత్తించింది. తన చెంతనున్న మగువ ముఖంలోని సిగ్గుకి అయిష్టతకు తేడా తెలుసుకో లేనంత పసివాడు కాదతను.

"శిల్పా, యీ పెళ్ళిని మీరు మనస్పూర్తిగా యిష్టపడే అంగీకరిస్తున్నారా ?" సూటిగా అడిగేసాడు.

తత్తరపాటుతో తల తిప్పింది శిల్ప.

"ఎందుకలా అడిగారు ?" చిన్నగా అడిగింది.

"ప్రశ్నకు మరో ప్రశ్న సమాధానం కాదు ! మీరిష్టపడే పెళ్ళికి ఒప్పుకున్నారా అని నేనడిగాను" అతను అసహనాన్ని పైకి కనిపించ నివ్వకుండా అన్నాడు.

"డాడి నేను పెళ్ళికి అంగీకరించిన తర్వాతే మీ దగ్గరకు వచ్చారు."

''నేనడిగింది మీకు పెళ్ళి యిష్టమా ? అని కాదు. నాతో జరుగుతున్న పెళ్ళి, అయ్‌మీన్ నేను ! నేను యిష్టమా అని'' అతను కారు నోపక్కగా ఆపేసాడు.

''ఇష్టమే !'' తల వంచుకుని అస్పష్టంగా, తప్పనిసరియై అన్నది.

''కాదు, యిష్టం లేదేమో అని నాకనిపిస్తుంది. ఇష్టమే అయితే . యిష్టమే అయితే ఆమాట చెప్పే పద్ధతి అదికాదని యింత నాగరికంగా పెరిగిన వారికి మీకు తెలియదూ ?''

శిల్పకి అసలీ పరిస్థితంతా ప్రవాహంలోపడి కొట్టుకుపోతున్నట్లుగా, ఊపిరాడనట్లుగా వుంది. చికాగ్గానూ వుంది.

''అంతే యెలా చెప్పాలని ? ఓహో, అయ్ లవ్ యూ అని మీ కళ్ళలోకి చూస్తూ మెడ చుట్టూ చేతులు వేసి చెప్పాలా ?

అలా చెప్పటమేనా యిష్టానికి రుజువు ?''

శిల్ప నుంచి అంత ఆవేశం ఎదురు చూడని అతను ఆ తీవ్రానికి ఓ క్షణం బిత్తరపోయినట్లు చూసాడు. ఆ తర్వాత నవ్వేసాడు

''ఆహ ; కాబోయే భార్యాభర్తల మధ్య మొట్టమొదటగా ప్రారంభమయిన సంభాషణలే ఎంత చక్కగా సాగుతున్నాయి !'' అన్నాడు.

అప్పటికి శిల్పకి తనెంత మూర్ఖంగా మాట్లాడిందో అర్థమయింది. పశ్చాత్తాప పూర్వకంగా అతని వైపు చూస్తూ ''సారీ'' అన్నది.

''ఇట్స్ ఆల్‌రైట్'' మళ్ళీ కారు స్టార్టు చేస్తూ మామూలుగా ఉండేందుకు ప్రయత్నిస్తూ అన్నాడు.








# ప్రేమించవే మనసా

''శిల్పా, యీ డొంక తిరుగుడు మాటలన్నీ ఎందుకు? సూటిగా, నిజంగా చెప్పెయ్యండి. నేనిష్టమా కాదా? నేనిన్నిసార్లు ఎందుకిలా తర్కిస్తున్నానని అనవద్దు. పెళ్ళంటే జీవితాంతము ఒకరి కొకరు తోడునీడగా గడపాల్సిన శాశ్వతమైన మధురానుబంధము. ఇష్టం లేని పెళ్ళివలన ఆ భార్యభర్తలే కాదు నష్టపోయేది వారికి పుట్టే సంతానం మధ్య కూడా ప్రేమానురాగాలు లోపిస్తాయి. నా భార్యను నేనెంత జీవన సర్వస్వంగా భావిస్తున్నానో అంతగా ఆ అమ్మాయీ నన్ను ప్రేమించాలనుకోవటము సహజమే కదా?

మొదటిసారి మిమ్మల్ని చూసినప్పుడే నేను వెతుకుతున్న నా జీవన సహచరిణి మీరే ననిపించారు. కానీ మీ ముభావత్వము, ఉదాసీనత చూస్తుంటే మీకు నేనంటే యిష్టం కలగలేదని అనిపిస్తుంది!'' రోడ్డు మీదే దృష్టి నిలిపి లోగొంతుకతో అతనంటున్న మాటలన్నీ విన్న శిల్ప మనసు రెపరెపలాడింది.

''తన జీవిత భాగస్వామిపై యింతగా కలలు కంటున్నితను మనసు లేని శరీరానికే తాను తాళి కట్టాడని తెలుసుకుంటే తట్టుకో గలడా? ఇతన్ని మోసం చేయటం క్షమించరాని నేరం కాదూ?'' అనిపించింది.

కానీ యిప్పుడిక వెనక్కు వెళ్ళలేని పరిస్థితుల్లో కూరుకుపోయారు. శుభలేఖలు కూడా అందరికీ పంచటం అయిపోయిన తర్వాత యిప్పుడీ పెళ్ళి ఆగిపోతే తల్లీ తండ్రి యిక తలెత్తుకోలేరు. కారణం తన నిజం చెప్పటమేనని తెలిసీ. ఆ భయంకర వాతావరణాన్ని తానూ ఎదుర్కోలేదు.

తప్పదు! జీవితంతో రాజీ తప్పనిసరి!

హృదయంలోని అలజడిని అధిమిపెడుతూ పెదవులపై చిరు నవ్వు తెచ్చుకుంటూ చిన్నగా అన్నది.

''మొదటి నుంచీ నా ప్రవర్తనే అంత. గలగలా మాట్లాడటము నాకు అలవాటు లేదు. ఎదుటవారిని ఆకట్టుకునేలా కబుర్లు చెప్పలేక పోవటం నాకున్న బలహీనత''

శిల్ప చెప్పినది విని తేలిగ్గా నవ్వాడు అతను.

''నేను కోరుకున్న అమ్మాయి నా జీవితంలోకి ప్రవేశిస్తుంది. అది చాలదూ? ద్వేషం లేకపోతే చాలు. ప్రేమించేట్లు చేసుకోవటం నా ప్రవర్తన ద్వారా వుంటుంది'' అనుకుంటు ''మీరు చాలా గడుసు వారు. ఇంతసేపు మాటల్లో మొత్తం మీద ''యిష్టమే'' అన్న పొడి మాట తప్ప ''మీరంటే నాకిష్టమే!'' అని చెప్పనేలేదు. కానివ్వండి. ఆ మాట చెప్పమని యికపై నేనెప్పుడు అడగను మీరే చెప్పాలి! చెపుతారు! కచ్చితంగా అతనంటున్న తీరుకి ముఖం అటు తిప్పకుని చిన్నగా నిశ్వశించింది శిల్ప.

షాపింగ్ సెంటర్ రావటంతో ఆ సంభాషణ ఆగిపోయింది.

షాపులో అతను చీరలు సెలక్టు చేయమన్నప్పుడు ''మీయిష్టం అన్నది.

''నా యిష్టం అనేసేందుకే అయితే మీరు నాతో యిలా రావటం ఎందుకు నేనే తీసేవాడ్ని కదా?'' అన్నాడు.

ఇక మళ్ళీ తర్కిస్తూపోతే యీ సంభాషణ ఎంత దూరం సాగుతుందో అని మరేమీ మాట్లాడక తన ముందు వుంచిన జరీ పట్టు చీరల్లో చేతికందినవి తీసి పక్కన పెట్టింది.

''ముహూర్తపు చీర చాల ఘనంగా ఉండాలన్నారు ఆంటీ ఈ చీరలు చూపిస్తే పెళ్ళికని కొన్నారా? సరదాగా కొన్నారా? అని అడుగుతారు'' అని తానే చీరంతా జరీ వున్నది ఖరీదైనదొకటి తీసాడు.

శిల్ప మౌనంగా చూస్తుండిపోయింది.

''బాగుందా యిది?'' అని అడిగినప్పుడు మాత్రం ''ఊ'' అని తల వూపింది.

తర్వాత అతను కూడా బట్టలు తీసుకుంటూ ''నాకోసం మీరు ఓ జత సెలక్ట్ చేయరూ?'' అడిగాడు.

అతని కన్నుల్లో చెప్పలేని ఉత్సాహం!

శిల్ప మౌనంగానే ఒసారి తన ముందున్న సూటింగ్ క్లాత్సన్నీ చూసి అందులో ఒకటి చూపింది.

నిండుగా నవ్వుతూ ''థాంక్యూ'' అన్నాడతను దాన్ని ప్యాక్ చేసేందుకు యిస్తూ.

వేలలో అయిన బిల్లుని చూసి సంతోషంగా] డబ్బందుకున్నాడు ప్రొప్రయిటర్.

★ ★ ★

అనుకున్న ముహుర్తానికి శిల్ప, శ్రీనాథ్‌ల వివాహం ఏర్పాట్లన్నీ వైభవంగా జరిగాయి.

పెళ్ళి రోజున విజ్జా తన కెమెరాలో కలర్ ఫిల్మ్‌లు లోడ్ చేస్తూ, ఫోటోలు తీస్తూ చాలా బిజీగా వున్నాడు. వివాహ కార్య క్రమమంతా మొదట వీడియోగా తీయిద్దామనుకున్నారు కానీ శ్రీనాథ్ —

''ఎందుకండీ, పెళ్ళనేది వధూవరుల మనసులో తీయని గుర్తుగా నిలిచిపోవాలి కానీ వీడియోల ద్వారా దాన్ని జ్ఞాపకం వుంచుకోవటమా?

అయినా యిదేమన్నా శ్రీనివాసుని కళ్యాణమా లేక శ్రీరాముని కళ్యాణమా ?'' అనటంతో పక్కనే వున్న విజ్జూ ''కానీ శ్రీనాధుని కళ్యాణం కదా !'' అనటంతో అందరూ నవ్వారు.

శ్రీనాథ్ కూడా నవ్వుతూ ''వద్దు !'' అనేయటంతో శివశంకరం గారు ఆ ప్రయత్నం మానుకున్నారు.

సస్య పెద్ద జరీ అంచు పట్టుచీర కట్టి సంబరంగా పెళ్ళి పనుల్లో పాల్గొంది.

షాజీ, ఫ్లారీ, సునంద వచ్చారు. రాదీ కూడా వచ్చింది వేవిళ్ళతో …రసంరా ఉన్నా.

అతిథులకు మర్యాద కార్యక్రమాలన్నీ యీ స్నేహితురాళ్ళ బృందమే చూసుకోసాగారు.

తొమ్మిదవనెల వచ్చినందువలన నిండు గర్భంతో పనుల అజమాయిషీల్లాంటివేం పెట్టుకోక ప్రశాంతంగా ఓచోట సంజయ్ పక్కన కూర్చుని పెళ్ళి వేడుకలన్నీ తిలకించ సాగింది రజియా.

శ్రీనాథ్ తన మెడలో మాంగల్యం కడుతుండగా వంచుకునివున్న తల ఎత్తి ఓ క్షణం అతనివంక చూసింది శిల్ప. అయితే తన కన్నుల్లో తడి అతని కంట పడక మునుపే చప్పున తల వంచేసుకుంది.

''శావ్, నిన్ను క్షమించమని కూడా అడగలేనిక. నీకు మనసిచ్చి మరొకరి భార్య నవుతూ ఒక తప్పు, మనసు లేని శరీరాన్ని భర్తకివ్వాలనుకోవటం మరోతప్పు ! రెండూ చేయిస్తుంది జీవితం నాచేత. ఇక యీనాటితో నిన్ను ప్రేమించాను అని చెప్పకునేందుకు కూడ నా కర్హత పోయింది !''

అనుకుంది చెక్కిలిపై కన్నీరు జా తుండగా. పెళ్ళి వేడుకలన్నింటిలోనూ ఎవరెలా చెపితే అలా యంత్రంలా చేయసాగింది శిల్ప.

హడావుడిగా అటూ యిటూ తిరుగుతూ అలిసిపోయిన సస్య ఓచోట నిలబడి థమ్సప్ బాటిల్ తీసుకుని నెమ్మదిగా తాగుతుంటే భానుతేజ వచ్చి పక్కన నిలబడ్డాడు

''అససే నాజూకైన అమ్మాయిలు మరీ యింతలా శ్రమపడగలరని నేననుకోలేదు సుమండీ !'' అన్నారు నవ్వుతూ.

అతని మాటలకి చిన్నగా నవ్వుతూ ''మీకు డ్రింక్ తెప్పించనా?'' అడిగింది.

''నో, థాంక్స్'' అంటూ కళ్యాణ మంటపం వైపు చూస్తూ ''మీ ఫ్రెండ్ కొంచెం సీరియస్ టైపు అనుకుంటాను'' అన్నాడు.

''ఏం ?'' అడిగింది సస్య.

''ఒక్క చిరునవ్వుకూడా నేనింతవరకూ చూడలేదు!''

''పెళ్ళి కూతురు కదా, ఊరికే నవ్వుతుంటే ఏం బాగుంటుంది పిచ్చిలాగ''.

''అయితేపెళ్ళికూతుర్లు నవ్వకూడదని ఎక్కడైనా రూలుందా?'' అన్నాడు.

''లేదు కానీ, నవ్వే తీరాలనీ ఎక్కడా రూల్లేదుగా !'' అన్నది గడుసుగా సస్య.

నవ్వేసాడు భాను. ''అమ్మాయిలతో మాటల్లో నెగ్గడం కష్టం!''

''అమ్మాయిలతో అంటున్నారు. చాలా మంది అమ్మాయిలు తెలుసన్నమాట !'' యధాలాపంగా అన్నట్లు అడిగింది.

' అమ్మబాబోయ్. మీతో మాట్లాడేటప్పుడు చాలా కేర్‌ఫుల్‌గా వుండాల్సిందే.'' బెదురుగా అతనంటున్న తీరుచూసి సస్య కూడా నవ్వేసింది.

సత్యనారాయణగారి పక్కన కూచుని మాట్లాడుతున్న ప్రకాష్ అప్పుడే యిటు తల తిప్పాడు.

ఆ దృశ్యానికి అతని మనసులో ఓ క్షణం యీర్ష్య తొంగి చూసింది కానీ ప్రయత్నం మీద ఆ భావాన్ని అణిచేసాడు. ఆరోజు

# ప్రేమించవే మనసా

సంఘటన తర్వాత సస్యను కలుసుకోనే లేదు ప్రకాష్.

సస్యకూ అతని నిర్లక్ష్యం రెచ్చగొట్టినట్లయింది. "తానేమైనా తప్పుచేసి వుంటే తప్పనిసరిగా అతన్ని ప్రాధేయపడాల్సిన, దగ్గర చేరాల్సిన బాధ్యత తనమీద వుంటుంది. కానీ తన తప్పేమీలేనపుడు అతనికేదో ద్రోహం జరిగి పోయినట్లు ఫీలయ్యి, మనదారులు వేరయిపోయాయన్నట్లు, నీ లెక్కేమిటన్నట్లు అంత తిరస్కారం చూపుతున్నపుడు తనకి మాత్రం ఏం పట్టింది అతని వెనుకే తిరగాల్సిన పని?" అనుకుంది. ఈ రోజు పెళ్ళిలో పొద్దున కలుసుకున్నా "హలో" అంటే "హలో" అనుకుని ఎవరిదారిన వారు తప్పుకున్నారు.

విషయమంతా తెలిసిన రజియా యిదంతా ఓ కంట గమనిస్తూనే ఉంది కానీ తా జోక్యం చేసుకుంటే బాగుంటుందా? ఇద్దరికిద్దరూ బెట్టుగానే ప్రవర్తిస్తున్నారు కదా, అనే సంకోచంతో మవునంగా ఉండి పోయింది.

"మీరూ శిల్పగారూ చాలా క్లోజ్ ఫ్రెండ్సనుకుంటాను" అడిగాడు భాను సస్యను.

"ఆ, పసితనంలో మాటలు నేర్చుకున్నప్పుట్నుంచీ స్నేహితులమే" అన్నది సస్య.

"అదీ, అలా చెప్పండి. మీ ఫ్రెండ్ మాటలు కూడా మీరే తీసేసుకుని ఉంటారు. అందుకే ఆమె మరీ అంత కామ్‌గా వుంటారను కుంటాను?" కనుక్కున్నట్లు చూసాడు భానుతేజ

"భలేవారే. నాతో మాట్లాడలేనంటూనే మాటకు మాట చెపుతున్నారు. మీరు మాత్రం ఏం తక్కువ?" అన్నది సస్య కాలీబాటిల్ తమముందు నుంచి వెళుతున్న నౌఖరు దగ్గర యిచ్చేస్తూ, అప్పుడే చూసింది ప్రకాష్‌నీ తండ్రిని.

వారి వెనుక నుంచి ఫ్లారీ ఎవరూ చూడకుండా కనుబొమలెగుర వేసింది సస్యను చూసి "ఎవరతను ?" అన్నట్లు భానుని చూసి

ఇక యిలా తామిద్దరూ వేరుగా నిలుచుని మాట్లాడుతుంటే బాగుండదు అనుకుని "రండి, మిమ్మల్ని మా నాన్నగారికి పరిచయం చేస్తాను" అంటూ అందుకి దారి తీసింది.

బుద్ధిమంతుడిలా ఆమెని అనుసరించాడు భాను.

దగ్గరకెళ్ళి "నాన్నా యీయన శ్రీనాథ్‌గారికి క్లోజ్ ఫ్రెండ్ భానుతేజ ." అని భాను వైపు తిరిగి,

"మా నాన్నగారు. ఇక వీరు ప్రకాష్. మానాన్నగారి స్టూడెంటు"

భానుతో కరచాలనం చేస్తూ సస్యవైపు చూసి చిన్నగా నవ్వాడు ప్రకాష్.

"ఎంత తెలివిగా పరిచయం చేసావు. మీనాన్నగారి స్టూడెంటునే తప్ప నీకేమీ కాదనేగా !" అనుకున్నాడు.

ఇంతలో విజ్జూ వచ్చి దేనికో పిలవటంతో సస్య అతనితో లోపలికి వెళ్ళిపోయింది.

ఫ్రెండ్సందరితోనూ నిలిపి వధూవరులకు ఫోటోలు తీసాడు విజ్జి.

మెడలో పూలమాలలతో కొంగుకి ముడివేసుకుని నూతన దంపతులు తమ కాళ్ళకు నమస్కరిస్తుండగా కన్నీళ్ళతో ఆశీర్వదిస్తున్న భువనేశ్వరి, శివశంకరంగార్లు ముక్కోటి దేముళ్ళను మనసులోనే ప్రార్థించారు. "ఈ జంటను సుఖశాంతులతో జీవించేలా చూడమని !"

★ ★ ★

ఆ రోజు నిదురలేచినప్పట్నుంచి కూడా రజియాకి ఒంట్లో అదోమాదిరిగా వుంది. మెల్లమెల్లగా పెయిన్స్ ప్రారంభమయినాయి. కానీ చెప్పాలంటే అనుమానంగా వుంది రజియాకి. వారం రోజులక్రితం యిలాగే వళ్ళంతా నలతగా వుండి నడుములు లాగుతూ వుండటంతో భయపడి భర్తతో చెప్పి విశాలాక్షిగారి దగ్గరకెళ్ళింది.

ఆవిడ పరీక్ష చేసి 'ఇవి ఫాల్స్ పెయిన్స్. డెలివరీకి యింకా టైమ్ వుందని" నవ్వుతూ చెప్పింది.

తొలి కాన్పు అవటంతో రజియాకెంతో కంగారు వుంది. ఇంట్లో ధైర్యం చెప్పేందుకు పెద్దవాళ్ళైన ఆడవారెవరూ లేరు సస్యకు ఏదైనా చెప్పాలన్నా, అడగాలన్నా సంకోచం. పెళ్ళికాని అమ్మాయి. చిన్న పిల్లతో ఏం చెప్పగలదు. అయినా తనకు మాత్రమేం తెలుస్తుంది ? అన్న వూహ పెదవి విప్పనివ్వలేదు.

నెలలు నిండి, డెలివరీ రోజులు దగ్గరపడే కొద్దీ ఒకటే దిగులు, భయం. విశాలాక్షి డాక్టరుగా ఎంత ధైర్యం చెపుతున్నా రజియాకి మాత్రం గాభరాగానే వుంటుంది.

"అందుకే కాబోలు ఆడపిల్లను నిశ్చింతగా వుంటుందని తొలి కాన్పుకి పుట్టింటికి తీసుకెళతారు. ఇలాంటి సమయాల్లో తల్లి దగ్గరుంటే ఏ విషయమైనా నిస్సంకోచంగా చెప్పగలుగుతుంది. తన కెవరున్నారు ? ఆదరంగా తనను గుండెలకదుముకుని "భయంలేదమ్మా" అని చెప్పగలిగే కన్నతల్లి వుండీ లేనట్లే. ఒకవేళ కాన్పు కష్టమై నేను చనిపోతే అపుడన్నా అమ్మా నాన్న వస్తారా ?" కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి రజియాకి.

బేంక్‌కి వెళుతూ భార్య ముఖం చూసి "రాజీ, ఎందుకలా వున్నావ్ ?ఆంటీని పిలువనా ?" అడిగాడు సంజయ్

"వద్దొద్దు, ఏం లేదు. బాగానే వున్నాను" అనేసింది రజియా

పోయినసారి వూరికే కంగారుపడి పోయినందుకు యింకా సిగ్గుగానే వుంది, ఆరోజు సస్య చాలా హడావుడి చేసేసింది. పాపాయి పుట్టేస్తుందని, కానీ యింకా టైమ్ వుండనేసరికి ముఖం వేలాడేసుకుంది.

"సరే అయితే, సస్యకీ పూట క్లాసులు లేవటగా. ఇంట్లోనే వుంటుంది. ఏమైనా అనుమానంగా వుంటే ఆంటీ దగ్గరకెళ్ళిపోండి' నాకూ ఫోన్ చెయ్యండి .వచ్చేస్తాను" అని మరీ మరీ చెప్పి సంజయ్ వెళ్ళిపోయాడు.

సత్యనారాయణగారు ఆయన గదిలో ఏదో చదువుకుంటున్నారు సస్య మేడ మీద వుంది.

సంజయ్ వెళుతుంటే బయటదాకా వచ్చి సాగనంపిన రజియా హాల్లోకి వచ్చేసరికి నొప్పి జాస్తి అవుతున్నట్లనిపించి సోఫాలో వాలి పోయింది. కాఫీ తాగాలనిపించి కిచెన్‌లోకి వెళుతూ హాల్లో రజియా కూర్చున్న తీరుచూసి "ఏమిటి వదినా, అలావున్నావేం ?" అంటూ దగ్గర కెళ్ళింది.

"నొప్పిగా వుంది సస్యా" అంటూ ఒక చేత్తో కడుపు పట్టుకుని మరో చేత్తో సోఫా అంచు పట్టుకుని బాధను పళ్ళ బిగువున ఓర్చు కుంటూ అన్నది రజియా.

"అరె, పెయిన్స్ వస్తున్నాయి కాబోలు" అనుకుంటూనే కంగారుగా.

"నాన్నా, నాన్నా" అంటూ పిలిచింది.

పనిమనిషి కూడా అంత క్రితమే వెళ్ళిపోయింది. సస్య గొంతు విని సత్యనారాయణగారు గభుక్కున పుస్తకం వదిలేసి వచ్చారు.

"నాన్నా వదినకి పెయిన్స్ వస్తున్నట్లున్నాయి. డాక్టరాంటీ హాస్పిటల్‌కి వెళ్ళిపోయి వుంటారు. ఇప్పుడెలా వదిన్ని తీసుకెళ్ళటం ?" కంగారుగా అన్నది.

ఆయనకీ కంగారు వేసింది. కోడలి పరిస్థితి చూస్తుంటే వెంటనే బయటకు నడుస్తూ "నేను టాక్సీ తెస్తాను" అన్నారు.

గేటు దగ్గరకు రాగానే పక్కింటి వాళ్ళ కారు అప్పుడే రోడ్డు మీదకి వచ్చింది. ఇంజనీరుగారు కూర్చుని వున్నారు డ్రైవింగ్ సీటులో

వడివడిగా ముందుకు వెళ్ళి కారు ఆపమన్నారు సత్యనారాయణగారు.

"సారీ ఫర్‌ది డిస్టర్బ్ సర్. మా కోడలికి పెయిన్స్ వస్తున్నాయి అమ్మాయిని హాస్పిటల్‌కి తీసుకెళ్ళాలి. దయచేసి కాస్త అక్కడ డ్రాప్ చేయగలరా ?" అడిగారు.

ఆయన వెంటనే "అలాగా, రండి" అన్నారు.

మరో యిరవై నిముషాలకి రజియా హాస్పిటల్లో లేబర్‌రూమ్‌లో వుంది. ఫోన్ చేయగానే సంజయ్ వచ్చేసాడు.

లోపల్నించి రజియా బాధతో కేక వేస్తుంటే సంజయ్ భరించ లేక పోతున్నాడు. కానీ తను చేసేదేంలేక నిస్సహాయంగా ఆ గది తలుపుల వంకే చూస్తూ కూర్చున్నాడు అక్కడున్న బెంచీపై.

సన్య అన్నయ్య దగ్గరగా కూచుని భుజంపై చేయివేసింది. ఆ అమ్మాయి ముఖంలోనూ చెప్పలేని ఆందోళన !

సత్యనారాయణగారికి పిల్ల లిద్దరినీ అలా దిగులుగా చూస్తుంటే జాలి, ప్రేమ కలిగాయి. "పిచ్చిపిల్లలు తమ యింటిలోకి పాపాయి రావాలని సంబరపడతారేకానీ కాన్పు అంటే అల్మారాలోంచి వస్తువు తీసు కోవటమా? అన్నీ తెలిసినట్లే వుంటారు. అయినా దేనికీ తట్టుకోలేరు."

మరికొన్ని నిముషాలు కరిగిపోయాయి. తామక్కడ చేసేదేం వుంటుంది నత్యనారాయణగారు చిన్నగా బయటకు వచ్చారు.

విశాలాక్షి రజియా దగ్గరే వుంది. కాలం మరీ మెల్లగా కదులు తున్నట్లుంది సంజయ్‌కి. అసహనంగా వుంది.

లోపల్నించి ఎందుకో తలుపు తీసుకుని బయటకు వచ్చిన ఓ సిస్టర్ని చూసి ఆమెను ఆత్రుతగా అడిగాడు సంజయ్.

"ఎలావుంది సిస్టర్ నా మిసెస్ కండిషన్ ?"

నిండా పాతికేళ్ళు కూడా లేని ఆ అమ్మాయి నంజయ్ ముఖం చూసి చిలిపిగా నవ్వింది.

"కంగారేం లేదు. ఈజీ డెలివరీవే అవుతుంది!" తేలిగ్గా చెప్పేసి ముందు కెళ్ళిపోయింది.

ఆమె నవ్వుకి సంజయ్‌కి కొద్దిగా కోపం వచ్చింది. "అవతల సాటి స్త్రీ బాధతో కేకలు వెస్తుంటే వింటు కూడా వీళ్ళకి నవ్వెలా వస్తుందో" అనుకున్నాడు.

అసలు లేబర్‌రూమ్‌లో బల్లపై కాన్పు అవుతున్న స్త్రీ ఒకవంక పెయిన్స్‌తో విలవిల్లాడుతుంటే పక్కనే చేరి జోక్స్ చెప్పుకొని వకవకలాడే నర్సులున్నారని సంజయ్‌కి తెలియదు. అందరూ అంతేకాకపోయినా చాలా మంది అంతే. తెలిసుంటే ఆ నర్సుదగ్గరకెళ్ళి ఆ ప్రశ్న వేసేవాడేకాదు.

ఎలా ఆయితేనేం మరి కొద్దిసేపటికే లోపల్నించి "కేర్ కేర్" మన్న పాపాయి ఏడుపు వినిపించింది.

"మైగాడ్ ! వదిన యింతసేపు అవస్థపడింది. ఇది యిజీ కాన్పే నంటారే వీళ్ళు !" అనుకుంది సన్య అమాయకంగా.

పాపాయి ఏడుపు వినిపిస్తున్నకొద్దీ సన్య వుత్సాహంగా లేబర్ రూమ్ తలుపుల దగ్గరే నిలుచుంది.

సంజయ్‌కి ఎంతో ఆత్రుతగా వుంది.

**(ఇంకా వుంది)**

# "ఫ్లర్ట్ ఫెలో!"

## విపంచి

"గుడ్‌నైట్! తియ్యటి స్వరంతో చెప్పింది వనజ.

"గుడ్‌నైట్ మళ్ళీ రేపు..." అని వేగంగా అడుగులేసాడు రఘు.

రఘు పార్క్ నుండి బయటపడి, పదడుగులు వేసాడో లేదో కొలీగ్ రాజేశ్వరరావ్ తగులుకున్నాడు, "ఎక్కడనుండి" అంటూ.

"పార్కు నుండి" మామూలుగా చెప్పాడు రఘు.

"ఏదీ, ఆ సెకండ్ బియ్యే వనజతోనేనా?"

రాజేశ్వరరావ్ మాటలకి ఒక్క క్షణం ఆశ్చర్యంగా చూసాడు రఘు.

ఆ ఆశ్చర్యాన్ని గమనించి పకపకా నవ్వాడు రాజేశ్వరరావ్. "ఈ లవ్‌స్టోరీలన్నీ ముందు మన దగ్గరికే వస్తాయి."

ఏమీ మాట్లాడలేదు రఘు.

ఇద్దరూ నడుస్తున్నారు.

"ఈ ఆడవాళ్ళని చచ్చినా నమ్మకూడదు గురూ!" వున్నట్టుండి అన్నాడు రాజేశ్వరరావ్.

"ఏం, ఎవరైనా నీకు మస్కా కొట్టారా?"

"అబ్బే, మస్కా కొట్టడం కాదు" నవ్వి, చెప్పాడు రాజేశ్వరరావ్ "ఈ కాలేజీ పిల్లలున్నారు చూసావ్ ?! ఎవడితో బడితే వాడితో లవ్ ఎఫైర్ జరిపేస్తారు.

మగవాళ్ళకి కావల్సినవేవో అందిచ్చేసి, ఆనందాన్ని అందుకొంటారు. పెళ్ళిమటుకు పెద్దవాళ్ల-యిష్టం ప్రకారం చేసుకొంటారు. పాపం, ఆ మొగుడు వెధవ తన భార్య నూటికి నూరుపాళ్ళు 'కన్నె' అని భ్రమిస్తాడు"

"నువ్వు ఏం చెబుతున్నావో నాకు అర్థం కావటం లేదు" విసుగ్గా చూసాడు రఘు.

ప్రతి గ్రంథానికి ఓ ఉపోద్ఘాతముంటుంది. నీ గ్రంథానికి కూడా..."

రాజేశ్వరరావ్ ధోరణి రఘుకి చిరాకుని, కోపాన్ని కలిగించింది.

"వనజతో ఎంతవరకూ చూసావు ఆనందాల అంచులు?" అదోలా చూసాడు రాజేశ్వరరావ్.

"డామిట్! నేను వనజని ప్రేమించాను. కామించలేదు" నొక్కి పలికాడు రఘు.

"ట్రై చెయ్, ఈజీగా 'లైన్'లో కొచ్చేస్తుంది" అనుభవం కాచి, వడపోసినవాడిలా అన్నాడు రాజేశ్వరరావ్.

"ఛ...ఎలా ఆలోచిస్తున్నావు నువు ? నేను వనజని సాయంత్రం పూట ఆషామాషీ కబుర్లు చెప్పుకోవటానికో, సిన్మాలు జంటగా చూసేటందుకో ప్రేమించటం లేదు. చాలా సిన్సియర్‌గా ప్రేమిస్తున్నామని" రఘు గొంతులో ఆ సిన్సియర్‌నెస్ కొట్టొచ్చినట్లు ధ్వనిస్తోంది.

హేళనగా నవ్వాడు రాజేశ్వరరావ్. "సిన్సియర్...హ హ హ... ఇప్పటికి చాలాసార్లు విన్నానా మాటని. విని, విని విసుగు పుట్టుకొచ్చింది నాకు. ఆ ముక్కని వొదిలేయి.

ఈ వయసులో ప్రేమించేది అమ్మాయిలతో 'కాలక్షేపం' చెయ్యటానికి తప్ప, పెళ్ళి చేసుకోవటానికి కాదు.

నీ ఫ్రెండ్‌గా నేనివ్వదల్చుకుంది ఒకే ఒక్క సలహా— వనజ అంతకు ముందూ ఎంత మందితోనో తిరిగి వుంటుంది అందులో నువ్వొక నంబర్‌వి మాత్రమే.

పెళ్ళిలాంటి పెద్దపెద్ద డైలాగ్స్ చెప్పొద్దు నాకు. జస్ట్... 'టేస్ట్' చూసి వదిలెయ్యి."

విపరీతమైన కోపానికి గురయ్యాడు రఘు. "నో డౌట్...యూ ఆర్ ఏ బ్లడీ ఇడియట్! నన్ను ప్రేమిస్తున్న అమ్మాయి పట్ల ఎంత నీచంగా మాట్లాడావు?"

"నువ్వెన్ని తిట్టినా, నేను పట్టించుకోదల్చుకోలేదు. రఘూ! నా అనుభవం మీద చెబుతున్నాను— ఈ అమ్మాయిలందరూ తమ బోయ్ ఫ్రెండ్స్ దగ్గర్నుండి ఆశించేది ఆ 'అనుభవం తప్ప' మరేది కాదు. నీ వనజ దీనికి అతీతురాలేమీ కాదు. కావాలంటే పరీక్షించుకో"చెప్పాడు రాజేశ్వరరావ్.

చిన్న అనుమానం ప్రవేశించింది రఘు మనసులోకి.

ఆలోచనలో పడ్డాడు— "వనజ కూడా అంతేనా?"

ఈ ప్రశ్నకి సమాధానం అతనికి అతి త్వరగానే లభించింది.

★ ★ ★

"వనజా! నువ్వేం అనుకోక పోతే..... " సందిగ్ధంగా ఆపేసాడు రఘు.

"ఎప్పుడైనా, ఏదైనా అనుకొన్నానా?" చిలిపిగా నవ్వింది వనజ.

"ఇట్స్ ఏక్వయిట్ డిఫరెంట్ మేటర్! ఈ రోజు సాయంత్రాన్ని ఇక్కడ పార్కులో కాకుండా, నా రూమ్‌లో 'స్పెండ్ చెయ్యాలి'' తట పటాయిస్తూ, చెప్పాడు రఘు.

అతనూహించినట్లుగా వనజ ఏ మాత్రం సందేహించలేదు. "పార్క్‌లో బదులు నీ రూమ్‌లో... అంతేగా! చిన్న మార్పు. నాకే అభ్యంతరం లేదు" నవ్వుతూ అంగీకరించింది.

అనుమానంగా చూసాడామెకేసి రఘు. "వనజ కూడా... కూడా..."

అబ్బా రఘూ! ఏమిటంతగా ఆలోచనలో పడిపోయావు?"

వనజ మాటలకి ఆమె వైపు తిరిగాడు రఘు. "ఏంలేదు!" నవ్వటానికి చేసిన ప్రయత్నంలో సక్సెస్ కాలేక పోయాడు.

మన విషయం మీ యింట్లో వాళ్ళకి వ్రాసావా?" అడిగింది వనజ.

"వ్రాస్తాను" గొణిగాడు.

మా యింటో వాళ్ళకింకా తెలీదు మన విషయం! వాళ్ళెన్ని అభ్యంతరాలు చెప్పినప్పటికీ, నేను నిన్ను పెళ్ళి చేసుకోవటం ఖాయం ! నువ్వు నా ప్రాణం రఘూ ! ! !"

వనజ గొంతులో క్షణం...క్షణకాలం పాటు ధ్వనించిన మాధుర్యానికి విచలితుడయ్యాడు రఘు.

('వనజ ఈజ్ ఏ గుడ్ గర్ల్'— మనసులో అనుకున్నాడు.)

ఇంతలో వారిద్దరూ రఘు రూమ్ చేరుకొన్నారు.

తలుపు తెరచి, ఆ చీకటి గదిలో 'లైట్' వేసాడు రఘు.

ఆ విద్యుద్దీప కాంతిలో కన్పించిన గదిని చూసి, పకపక నవ్వింది వనజ. "అచ్చం బ్రహ్మచారి రూమ్ అన్పించుకొంది!" అన్నది చెల్లాచెదురుగా వున్న సామానుకేసి చూస్తూ

"కూర్చో!" ఆ గదిలోవున్న ఏకైక మడత మంచాన్ని 'ఆఫర్' చేసాడు.

"కుర్చీలేదా?" మంచంమీద కూర్చుంటూ, యథాలాపంగా అడిగింది వనజ.

"లేదు... చిన్నసైజు రిపేర్" చెప్పి, ఓ సెకనాగి అడిగాడు రఘు "మంచినీళ్ళు తీసుకొంటావా?"

"నో!" ముక్తసరిగా చెప్పి, గదిని పరిశీలించటంలో నిమగ్నురాలై పోయింది

కొద్దిసేపటి తర్వాత గమనించింది వనజ— రఘు నిలబడి వుండటం




''అదేమిటి రఘూ! అలా నిలబడిపోయావు? నీ గదిలో నువ్వే తటపటాయిస్తున్నావా! ఫర్లేదు నా ప్రక్కన కూర్చోవచ్చు'' అతడి చేయిపట్టి, లాగింది వనజ.

తడబడుతూ, ఆమె ప్రక్కన కూర్చున్నాడు రఘు.

వనజ నవ్వుతూ, ఏదో మాట్లాడుతోంది.

ఆ శబ్దాలు రఘుకి విన్పించటం మానేసి, చాలా సేపయ్యింది.

అతనికికన్పిస్తుంది, విన్పిస్తుంది ఒక్కటే- వనజ ముగ్ధమోహన రూపం.

వేగంగా ప్రవహిస్తున్న రక్తం...

మెరుస్తున్న వనజ అందమైన కళ్ళు...

ఏదో వూహించి, ఆశపడుతున్న హృదయం ఉద్వేగంతో కొట్టుకుంటున్న గుండె...

వనజ ఎర్రని బుగ్గలు. యాపిల్ పళ్ళని గుర్తుకు తెప్పిస్తూ...

నవ్వుతుంటే, గుండెల మీద అటూ--యిటూ కదులుతున్న సన్నటి గొలుసు...

అనుభవం... అవకాశం ... అవకాశం ... అనుభవం...

నవ్వే పలు వరుస...

కోరికతో ఎరుపెక్కుతున్న కనులు...

రాజేశ్వరరావ్ సలహా...

వనజ మెడవంపు...

శీలానికో పరీక్ష...

కోరిక... కోరిక...

దహించుకుపోతున్నాడు రఘు.

చటుక్కున వనజ మీదకు వాలి, ఆమె ఎర్రటి పెదాలని చుంబించాడు.

తెల్లబోయి చూసింది వనజ - ఓ క్షణం మాత్రమే.

తన నడుముని చుట్టుకుపోతున్న రఘు చేతులని విసురుగా వదిలించుకొని, వడివడిగా నడుస్తూ, బయటికి వెళ్ళిపోయింది వనజ.




కొద్ది సేపటి వరకూ నిశ్శబ్దం—ఆ గదిలో...

ఆ తర్వాత చిన్నగా అరిచాడు రఘు—నా వనజ అందరిలాంటి ఆడపిల్ల కాదు!''

★ ★ ★

''చూసావా రాజేశ్వరరావ్? నీ అంచనా ఎంత దారుణంగా తప్పిందో! నా వీనస్ వనజని సాధారణపు అమ్మాయిల్లా జమ కట్టేస్తావా!'' ఆనందంగా అంటున్నాడు రఘు రాజేశ్వరరావ్‌తో, ఆ మరునటి రోజు మధ్యాహ్నం లంచవర్లో—

''పెళ్ళయ్యే వరకూ ప్రేమించిన వ్యక్తితో కూడా చనువు తీసుకోవటానికి యిష్టపడదు నా వనజ. ఆమెని శంకిస్తావా?''

రఘు మాటలకి ఏమీ మాట్లాడలేదు రాజేశ్వరరావ్.

ఆ రోజు సాయంత్రం ఆఫీస్ నుండి బయటికొస్తున్నప్పుడు చెప్పాడు. ''సారీ రఘూ, నేను పూర్తిగా పొరబడ్డాను!''

★ ★ ★

పార్కులో అరగంటనుండి అసహనంగా వెయిట్ చేస్తున్నాడు రఘు—ఎంతైనా యింకా రాని వనజ కోసం.

ఆ రోజే కాదు— ఇంకో రెండు, మూడు సాయంత్రాలు కూడా రఘు నిరీక్షించాడు.

కాని వనజ రాలేదు.

నాలుగోరోజు మధ్యాహ్నం రఘు ఆఫీస్ అడ్రస్‌కి ఓ కవర్ వచ్చింది.

ఆ కవర్ మీది వ్రాత వనజది!

ఆత్రుతతో ఆ కవర్‌ని ఓపెన్ చేసాడు రఘు. చదువుతుంటే రక్తం లేనివాడిలా తెల్లగా పాలిపోయింది అతని మొహం.

అందులో నాలుగే నాలుగు వాక్యాలున్నాయి.

''మిస్టర్ రఘూ !

మీరు మంచివారని, అందరిలాంటివారు కాదని మిమ్మల్ని మనసారా ప్రేమించాను. ఆ రోజు రూమ్‌లో మీ ప్రవర్తన నాకంతా చెప్పింది.

పెళ్ళికాని ఆడపిల్లల్ని ప్రేమ పేరుతో వంచించి, అనుభవించాలని ఆశపడే అప్టరాల్ ఒక మగ పురుగువేనని నా కర్థమైంది.

నీలాంటి 'లూజ్ క్యారక్టర్' మనిషిని నేను పెళ్ళి చేసుకోలేను. ప్రేమించలేను.

గుడ్‌బై ! ఇక నన్ను కలవటానికి ప్రయత్నించకు.

— వనజ.''

★ ★ ★

ఆ తర్వాత కొద్ది రోజులకే రఘు వనజ పెళ్ళి శుభలేఖ అందుకొన్నాడు— కాని ఆమె నుండి కాదు! వనజకి భర్త కాబోతున్న పెళ్ళి కొడుకు రాజేశ్వరరావ్ నుండి.

''వనజ— రాజేశ్వరావ్'' ప్రక్క ప్రక్కనున్న ఆ పేర్లని చూస్తూ, షాక్‌తో అలాగే నిలబడి పోయాడు రఘు. ''ఏమిటిది?'' అస్పష్టంగా గొణిగాడు.

బదులుగా నవ్వి, పూరుకొన్నాడు రాజేశ్వరరావ్.

పైకి అనక పోయినా మనసులో మాత్రం అను కొన్నాడు. ''సారీ రఘూ! మా వివాహానికి వనజ తల్లిదండ్రుల అనుమతి ఎప్పుడో లభించింది. కాని వనజే నిన్ను ప్రేమిస్తుంది. నాకు వనజ తత్వం బాగా తెలుసు. అందుకే నిన్నిలా రెచ్చగొట్టి, వనజను నీకు దూరంచేసి, నాకు దగ్గర చేసుకున్నాను. నీతో తిరిగి నంత మాత్రాన వనజకు జరిగిన నష్టమేమీ లేదు ఇక మా జీవితం ఆనందంగా గడిచి పోతుంది.'' □















# సిక్కో-కోక్
# వీలైన వంటకు పొదుపైన ఇంధనం

శాస్త్రీయ పద్ధతిలో సిక్కో కోక్ తయారు చేయువారు

**ది సింగరేణి కాలరీస్ కంపెనీ లిమిటెడ్,**
**ఆంధ్రప్రదేశ్.**

Sista s/SCCL/230/85/Tel

## పౌరాణిక సందర్భకోశ్
## డాక్టర్ కుట్టన్ పిళ్లై

కొన్నికొన్ని భాషలకు ప్రపంచ సన్నివేశాలను బట్టి అదృష్టం పడుతుంది. ప్రాకృత సంస్కృతాలకు ఆ అదృష్టం ఒకప్పుడు పట్టింది. ప్రపంచం నాలుగంచుల వారూ వాటిలో రచనలు సాగించి, వాటిని సంపన్నం చేశారు. విజయనగర సామ్రాజ్య కాలంలో తెలుగుకూ అలాటి భాగ్యం కలిగింది. హిందీ, తమిళ, కన్నడ, మహారాష్ట్ర, కేరళలు కూడ తెలుగు నేర్చుకుని రచనలు చేశారు. ఇటీవలి యుగాలలో ఆంగ్లానికి ఆ యోగం కలిగింది. రవి అస్తమించని సామ్రాజ్యం కావడం వల్ల ఆంగ్లాన్ని విధిగా అందరూ నేర్చుకొని, తమతమ భాషలలోని ఉత్తమ సాహిత్యాన్ని ఆంగ్లభాషకు అందించారు. మధ్య యుగాలలో ఫ్రెంచి భాషకూ, స్పానిష్ భాషకూ ఆ భాగ్యం అబ్బింది. భారతదేశం స్వతంత్రమైన పిదప ఖడీ బోలీ హిందీకి ఆ యోగం కలిగింది. సంధాన భాష కావడం వల్ల ఈ హిందీకి విస్తరించే అవకాశం యాదృచ్ఛికంగా కలిగింది. మన దేశంలోని ప్రతి రాష్ట్రంవారే కాక, ప్రపంచంలోని ఇతర భాషల వారూ తమసాహిత్య సౌరభాలను హిందీ ద్వారా భారతీయులకు అందించాలని ప్రయత్నిస్తున్నారు. అంతేకాక హిందీలో స్వతంత్ర రచనలూ చేసి హిందీవారికి మార్గదర్శకులవుతున్నారు. జ్ఞానపీఠ బహుమతి ఏర్పడటంతో బహుమతి పోటీకి పంపే ప్రతి ఇతర భాషా రచనా, హిందీలో విధిగా అనూదితం కావడం వల్ల ఏటా కొన్ని ఇతర భాషల ఉత్తమ గ్రంథాలు హిందీని అలంకరిస్తున్నాయి. తక్కిన రాష్ట్రాల ఇతర భాషల వారు, తమ వ్యక్తిత్వ వ్యాప్తి కోసం, సేవా దృష్టితోను హిందీలో రచనలు సాగిస్తున్నారు. అలాంటి సేవా ధురంధరులలో అగ్రగణ్యులు డాక్టర్ ఎన్.పి. కుట్టన్ పిళ్లై. ఈయన పూర్తి పేరు నడవత్తర కిళ్ కేతిల్ పద్మనాభ కుట్టన్ పిళ్లై. ఈయన కేరళ రాష్ట్రంలోని తట్టయిలలో జన్మించారు 1935 ఆగస్టు 29న. పట్టభద్రులయిన పిదప ఆంధ్రప్రదేశ్‌కు వచ్చారు. ఉపాధ్యాయ వృత్తి స్వీకరించారు. హిందీలో ఉన్నతి పొందారు. ఛాయావాదంలో ప్రత్యేకంగా కృషిచేసి డాక్టరేట్ పొందారు. శిక్షణ సాహిత్యం, సంస్కృతి, భారత భాషల సంబంధం, విమర్శ, అనువాదం, ఛాయావాద సాహిత్యధ్యయనం ఈయన కార్యక్షేత్రాలు. ఛాయావాదీ బింబివిధాన్— ఔర్ ప్రసాద్, పంత్—ఛాయా వాదీ వ్యక్తిత్వ ఔర్ కృతిత్వ, పంత్ కావ్య మే బింబయోజనా, కావ్య బింబ, కేరళ సాహిత్య ఔర్ సంస్కృతి, అధ్యయన ఔర్ అనుసంధాన్, ఆధ్యాత్మ

## హైదరాబాద్ నోట్‌బుక్

రామాయణ ఔర్ ఉత్తర రామాయణ, ధర్తీకే సంతుష్ట తమలోగ్, సంత్ కబీర్, కైరలీ వైభవ, స్వతంత్రతా సేనానీ అల్లూరి సీతారామ రాజు, హిందీ పర్యాయకోశ, ప్రసాద్ ఔర్ కామాయనీ, హమారే కలాకార్, తులనాత్మకవ్యాకరణ్, ప్రబంధప్రదీప్, హిందీ నిబంధ, హిందీసాహిత్య కా సుగమ ఇతిహాస, సరళహిందీ వ్యాకరణ, మాయా లంకీ ప్రతినిధికహానియా, మున్నగు మౌలిక విమర్శ గ్రంథాలు, వ్యాసంకలనాలు, అనువాదాలు, కోశాలు, వ్యాకరణాలు హిందీలో రచించారు. ఈయన నూతన మహాగ్రంథం పౌరాణిక సందర్భకోశ. ఇది హిందీలో అపూర్వ గ్రంథం.



మన పూర్వ గ్రంథాలహరిలాగే పురాణేతిహాస పాత్రాల స్థలాదుల విజ్ఞాన సర్వస్వ మిది. భారతీయ పురాణేతిహాస విషయాలకే ఇది పరిమితం కాక దూరప్రాచ్య పాశ్చాత్య పురాణేతిహాసాల విశేషాలు దీనిలో పొందు పరచడం దీని విశిష్టత. దాదాపు వేయిపుటల ఈ ఉద్గ్రంథం ఆవిష్కరణ మార్చి 17న రవీంద్ర భారతి మినీ థియేటర్‌లో జరిగింది. ఆవిష్కరణోత్సవం దక్షిణాంచలీయ సాహిత్య సమితి పక్షాన జరిగింది. ఈ గ్రంథాన్ని స్థానిక కిరణ్ ప్రకాశన్ అనే సంస్థ ప్రచురించింది. మాజీ విద్యామంత్రి, మాజీ రాష్ట్ర ప్రధాన న్యాయమూర్తి, విద్వాంసులు శ్రీ గోపాల్‌రావ్ ఎక్‌బోటే అధ్యక్షత వహించారు. మైసూర్ విశ్వవిద్యాలయం హిందీ శాఖ అధ్యక్షులు, ఆచార్య డాక్టర్ ఎం. రాజశేఖరయ్య గ్రంథాన్ని ఆవిష్కరించారు. పౌరాణిక సందర్భాలకు ఆకరాలు కూడ గ్రంథంలో ఇచ్చివుంటే, పరిశోధకులకు చాల ఉపయోగపడేదని ఆయన అన్నారు. ఉస్మానియా విశ్వ విద్యాలయం సంస్కృతాచార్యులు డాక్టర్ పి. జి. లాల్యే, హైదరాబాద్ సమాచార్ సంపాదకులు శ్రీ మునీంద్రజీ ఈ గ్రంథం ఉపయోగితను గురించి ప్రసంగించారు. అధ్యక్షులు శ్రీ ఎక్‌బోటే ప్రసంగిస్తూ, రాజ్యాంగంలో హిందీ నిర్వచనం స్పష్టంగా ఉందని, ఇప్పుడు ఉత్తర భారత రాష్ట్రాలలో వ్యవహారంలో వున్న ప్రాంతీయ భాష అయిన హిందీ అని భ్రమపడరాదని, దేశంలోని అన్ని ప్రాంతాల సంస్కృతిని, అవసరమైన పదజాలాన్ని ఆకళించుకొని వృద్ధిపొందే భాషే రాజ్యాంగం నిర్దేశించిన సంధాన భాష అయిన హిందీ అని అన్నారు. ఇతర ప్రాంతాలవారు రచించే హిందీ గ్రంథాలలో ఆ ప్రాంతాల సాహిత్య సంప్రదాయాల ఛాయలు పడి హిందీ భ్రష్టమై పోతున్నదని హిందీ ఆవేశ పూరితులు బాధపడ నక్కరలేదని, అలాంటి ఛాయ తప్పదని ఆయన అన్నారు. దేశంలోని అన్ని భాషా సాహిత్య సంప్రదాయాలతో పరిపుష్టమైన నూతన హిందీయే సంధాన భాష కాగలదని ఆయన అన్నారు. పౌరాణిక్ సందర్భ కోశ్‌వంటి గ్రంథాన్ని సిద్ధపరచిన దక్షిణాంచల సాహిత్య సమితి కృషిని ఆయన ప్రశంసించారు. పిదప గ్రంథాన్ని ప్రచురించిన కిరణ్ ప్రకాశన్ అధిపతిని సత్కరించారు. డాక్టర్ కుట్టన్‌పిళ్లై తమ ప్రసంగంలో ఈ గ్రంథ రచనలో ముఖ్య ఉద్దేశాలు వివరించారు. పుస్తకం పుటలు పెరుగుతాయని ఆకరాలు ఇవ్వలేదని ఆయన అన్నారు. ప్రారంభంలో దక్షిణాంచల సాహిత్య సమితి అధ్యక్షులు డాక్టర్ భీమ్‌సేన్ నిర్మల్ స్వాగతం పలికారు. చివరన ఉస్మానియా విశ్వ విద్యాలయం హిందీ విభాగం రీడర్ డాక్టర్ సత్యనారాయణ వందన సమర్పణ చేశారు. తమ మాతృ భాషా రాష్ట్రానికే కాక, ఆంధ్రప్రదేశ్ కీర్తిని ఇనుమడింప జేస్తున్న డాక్టర్ కుట్టన్ పిళ్లైను మనసారా అభినందిస్తున్నాను.

### ఉపశ్రుతి :

శ్రీ పెరుమాళ్ల గుండాచార్యులనే విద్వాంసులు శ్రీ మాస్తి వేంకటేశయ్యం గారును కలుసుకుని, జ్ఞానపీఠ బహుమతి వచ్చినందుకు అభినందిస్తూ, "మీకుఎప్పుడో రావలసింది ఈ బహుమతి ఆలస్యంగా వచ్చింది" అన్నారట. "ఇంట్లో ఏమైనా మిఠాయిలు చేస్తారను కొండి. మొదట పిల్లలకు ఇస్తారు. మిగులు బొగులు ముసలి వాళ్ళకిస్తారు. అలాగే జరిగింది కాబోలు ఈ బహుమతి ప్రదానం"– అన్నారట నవ్వుతూ శ్రీ మాస్తి.

**తిరుమల రామచంద్ర**

*Printed and Published for Nageswara Rao Estates Private Ltd., by S. Nageswara Rao at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-3, Editor : S. Radhakrishna, Phones : P. B. X. : 61247, 61248 & 75667.*

గ్లూకోస్ కానుక

# తక్షణ శక్తిదాయక అద్వితీయ పానీయం జిల్లనిపించే నారింజ రుచి గలది

విటమిన్-సి తో పరిపుష్టమైనది.

గ్లూకోజ్ చేరిన కొత్త గ్లూకోన్-సి. బిడ్డను ఉరుకుల పరుగుల ్సాహంతో నింపి ఉంచే, అనుకూల ర సత్వర శక్తిదాయక ఆహారం.

ఇది, పిల్లలలో పళ్ళు, ఎముకలు, ర ధాతువుల పెంపుదలకు అత్యవసర న విటమిన్ సితో పరిపుష్టమైనది.

ఒక గ్లాసు చల్లని ఐస్ వాటర్‌లో ాలుగు టీస్పూన్ల గ్లూకోన్-సి రిగించి, జిల్లనిపించే నారింజ రుచిగల ల్లాస పానీయాన్ని తయారుచేయండి, రోజుకు రెండుసార్లు మీ బిడ్డకివ్వండి.

GLUCON-C

**The unique, refreshing instant energy drink with a tangy orange taste.**

**Ingredients:**

Dextrose monohydrate (glucose) sucrose, citric acid, calcium phosphate, sodium chloride, vitamin C, permitted colours and flavouring agents.

ARTIFICIALLY COLOURED AND ARTIFICIALLY FLAVOURED

**Glucose:** An easily assimilated ready source of energy for body tissues.

**Vitamin C:** For the development of teeth, bones and body tissues.

Each serving of Glucon-C (approx. 35 g) provides 17.5 mg of vitamin C and 120 calories

Glaxo

ఎక్కువ ధరైన పంచదార కలపనవసరం లేదు



# గ్లూకోన్-సి

GLL-1174 R

Regd. No. H/VJ-41 ANDHRA SACHITRA VARA PATRI
26-2. May. '85